## కేవలం విక్స్ వేపొరబ్ మాత్రమే
## రొంప జమకూడే మూడుచోట్లా తక్షణం పనిచేస్తుంది...

# రాత్రికి రాత్రే
# రొంపను మాపుతుంది !




**విక్స్ వేపొరబ్ రెండు విధాల పని చేస్తుంది—రాత్రి అంతా కూడా—మీ ముక్కులోనూ, గొంతుకలోనూ, ఛాతీలోనూ పనిచేసి, మీ రొంప బాధను దూరం చేస్తుంది.**

రొంపతాలిచిహ్నాలు కనబడగానే, ముక్కు వెంబడి చీమిడి కారడం, గొంతుపుండూ, ఛాతీలో భారం, ఈ చిహ్నాలు కనబడగానే, విక్స్ వేపొరబ్ ఉపయోగించండి. కేవలం విక్స్ వేపొరబ్ మాత్రమే రొంప జమకూడే ఈ మూడు చోట్లా అంటే ముక్కూ, గొంతుకా, ఛాతీలలో వెంటనే పనిచేస్తుంది. రొంప బాధలను రాత్రికి రాత్రే దూరం చేస్తుంది. నిద్ర పోయేముందు, విక్స్ వేపొరబ్‌ను, ముక్కు మీదా, గొంతుకమీదా, ఛాతీమీదా, వీపుమీదా బాగా రాయండి. వెంటనే మీకు, విక్స్ వేపొరబ్ చర్మాన్ని వెచ్చగా చేయడం మీకు కనబడుతుంది. అదే సమయంలో మీ సొంత శరీరపు వేడి విక్స్ వేపొరబ్‌ను సత్వరం ఔషధాల ఆవిరిగా మార్చి వేస్తుంది. ఈ ఆవిరిని మీరు రాత్రంతా ప్రతిసారి ఊపిరి పీల్చినపుడల్లా లోనికి తీసుకొంటారు. ఈ అద్భుతమైన ద్వివిధచర్య, మీరు నిద్ర పోతున్నంతసేపూ జరుగుతూనే వుంటుంది. రొంప హెచ్చుగా బాధపెట్టే, ముక్కూ, గొంతుకా ఛాతీలలో ఉపశమనం కలుగజేస్తుంది. ఉదయానికల్లా మీ రొంప చాలావరకు తగ్గిపోతుంది. మీరు తిరిగి ఆరోగ్యంగా ఆనందంగా వుంటారు.

విక్స్ వేపొరబ్‌ను రొంపజమకూడే ఈ ప్రాంతాలలో మర్దనా చేయండి.

| | | |
|---|---|---|
| వేపొరబ్‌ను ముక్కులోపలా చుట్టూరాయండి. | వేపొరబ్‌ను గొంతుకమీదా, ఛాతీమీదా మర్దనా చేయండి. | వేపొరబ్‌ను వీపు అంతటా రాయండి. |




పొదుపుగల ఇంటి సీసా సాధారణపు నీలపు సీసా సౌలభ్య అను పచ్చ డబ్బా

# విక్స్ వేపొరబ్

కుటుంబములో ప్రతి ఒక్కరికీ— రాత్రికి రాత్రే రొంపను మాపుతుంది.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

STUDIO Roopkala











రవీంద్ర ఆర్ట్ ప్రొడక్షన్స్

# లక్షాధికారి



దర్శకత్వం
వి. మధుసూదనరావు

నిర్మాతలు
డి. వి. రెడ్డి
తమ్మారెడ్డి కృష్ణమూర్తి

REVATHI

ఆంధ్ర, నైజాం.
భాస్కర్

# పాఠకుల లేఖలు

## అక్టోబర్ 1963

"చందమామ" ప్రతినెలా చదువుతూ ఉంటాను. అందమైన అట్ట మీది బొమ్మలు అమితాకర్షణీయంగా ఉంటూ ఉన్నాయి. "భారతచరిత్ర" సత్యానికి దాపుగా, విషయపూరితంగా ఉంటూ ఉంది. "రాకాసిలోయ" పాఠకుల పఠనాసక్తిని, అభిరుచిని ద్విగుణీకృతం చేస్తూ ఉంది. సెప్టెంబరులోని "హృదయ పరివర్తన", "గుండ్రాయి మహిమ", "రాజ ద్రోహులు" కథలు ఎంతో చక్కగా, మనోహరంగా ఉన్నాయి.

"సాహిత్యరత్న" షేక్ మహమ్మద్ ముస్తఫా, వెలవలి

"రాకుమారి జులేకా" కథ చాలా బాగుంది. రచయితకు నా అభినందనలు.

—వేగూరు విజయకుమార్‌బాబు, నెల్లూరు

"రాకాసిలోయ", "రామాయణం"లోని చిత్రాలు కన్నుల పండువుగా నున్నవి. మహాభారతంను ఎక్కువ చేసినందుకు నాయొక్క అభివందనములు తెలుపుచున్నాను.

—యం. సత్యనారాయణ, బిట్రగుంట

గుండుభీమన్న కథలు పూర్తి అయిపోయినందుకు చాలా విచారిస్తూన్నాము. భీమన్న కంటె అధికముగా నవ్వించే కథ మరల వేస్తేగాని "చందమామ" చదువుటకు ఆసక్తి కలగదు.

—ఆర్. వెంకటరావు, ఏలూరు

"రాకుమారి జులేఖా" నన్నెంతో ఆకర్షించినది. ఈ నెల గుండుభీమన్న కథ కూడా చాలా బాగుంది.

—ముల్లంగి అమ్మాజీ, గోపాలపురం

"గుంగ్రాయి మహిమ", ఎన్. శాంతకుమారిగారు వ్రాసిన "రాజద్రోహులు", "కిష్కింధాకాండ" మున్నగునవి చక్కగా నున్నవి. "రాకాసిలోయ" చదివిన కొలది ఇంకా చదువవలెనని ఉంది. గుండుభీమన్న కథలు సమాప్తమైనందుకు విచారించుచున్నాను.

-శ్రీ కాకర్లపూడి అనంతలక్ష్మీసత్యవతిదేవి, రాజవొమ్మంగి

మామా! సెప్టెంబరు నెల్లో నిన్ను అంతా దిష్టి కొట్టేశారు. నీకు చెప్పలేనంత దిష్టి తగిలింది. అందుకని ఏమన్నా దిగతుడిచి...

—కుచ్చర్లపాటి సుబ్బరాజు, కొత్తలంక

"రాకాసిలోయ" కథకు ప్రతినెలా ఎదురు చూస్తున్నాను. అటువంటి కథ ఎప్పుడూ చదువలేదు.

ఎం. ఎస్. ఆర్. చంద్రమూర్తి, ప్రగడవరం

"రాకుమారి జులేకా" తొందరగా ముగిసినందుకు బాధగా ఉంది. "గుర్రం కిరాయి" అంత బాగా లేదు. "రాకాసిలోయ" "రామాయణం" ఇంక ముందేమవుతుందోనన్న ఆత్రుతను కలిగిస్తున్నాయి.

—ఏ. శేషగిరిరావు, యెమ్మిగనూరు

మహాభారతము 4 పేజీలు వేసినందుకు సంతోషం. అగ్ని గోళాలు గురించి విపులంగా వ్రాసినందుకు నా ధన్యవాదాలు.

—సి. ఆర్. తోట, తిరువూరు

"రాజద్రోహులు", "గుర్రానికి కిరాయి", "హృదయ పరివర్తన" కథలు నైస్‌గా వున్నాయ్.

—యం. యస్. రావ్, వూలపల్లి






గోకుల్ ప్రొడక్షన్స్...
శ్రీ తిరుపతమ్మ కథ
దర్శకత్వం
బి.యస్. నారాయణ
నిర్మాత
దోనేపూడి కృష్ణమూర్తి
డిస్ట్రిబ్యూటర్స్:- ఆంధ్ర: శ్రీకృష్ణా పిక్చర్స్, సీడెడ్, నైజాం: పూర్ణా పిక్చర్స్
REVATHI


LIFEBUOY
SOAP
LIFEBUOY SOAP



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో రామాయణం "సుందరకాండ" ఆరంభమవుతున్నది. రామాయణంలోని అన్ని కాండల కన్న ఈ సుందరకాండకు ప్రశస్తి హెచ్చు.

"చందమామ"లో ప్రచురిత మవుతున్న రామాయణ కథ పూర్తిగా వాల్మీకిదే నని గ్రహించని పాఠకులింకా ఉన్నారు. కొందరు వానరుల సంఖ్యలను మేము కల్పించా మనుకుంటున్నారు. అలాటి అపోహ లేమీ వద్దు. వాల్మీకి రామాయణంలో ఉన్న విషయాలే కొంతవరకు సంగ్రహ పరిచి, దీర్ఘమైన వర్ణనలూ, సంభాషణలూ తగ్గించి ప్రచురిస్తున్నాం. ప్రాచీన కావ్యాల లోనూ, పురాణాల లోనూ మన ఊహకు అందని విషయాలు అనేకం ఉంటాయి. అవి నిజమా, కాదా అని వితర్కించటం వృథా.

సంపుటి : 33 - అక్టోబర్ 1963 - సంచిక : 4











# భారత చరిత్ర



ఘియాసుద్దీన్ తుఘ్లక్ పేరుతో ఢిల్లీ సుల్తానయిన ఘాజీ మలిక్ వంశం దేశీయమైనదని చెప్పవచ్చు. అతని తండ్రి బల్బన్ హయాంలో భారతదేశానికి వచ్చి, జాత్ కన్యను వివాహ మాడాడు. పుట్టుక చేత తక్కువ స్థితి గలవాడైన ఘాజీ మలిక్ కేవలమూ తన స్వశక్తితో సామ్రాజ్యంలోని అత్యున్నత స్థానాన్ని అందుకున్నాడు. ఢిల్లీ సామ్రాజ్య సరిహద్దులపై మంగోలులు సాగించిన దాడులను అతను ఎంత దక్షతతో తిప్పి కొట్టాడో మనం లోగడ తెలుసుకున్నాం. అతను వృద్ధాప్యంలో ఢిల్లీ సింహాసనం అధిష్ఠించాడు.

ఢిల్లీ పెద్దలు అతన్ని సుల్తానుగా ఎన్నుకోవటంలో ఏ మాత్రమూ పొరపాటు చేయలేదు. అతను రాజ్యానికి వచ్చే సమయానికి పరిస్థితులేమీ బాగాలేవు. అలాఉద్దీన్ మరణానంతరం ఏర్పడిన అరాజకం మూలాన పరిపాలన అంతా దెబ్బ తిన్నది, దూరపు రాష్ట్రాలలో ప్రభుత్వంపట్ల అలక్ష్యం ఏర్పడింది. అయితే ఈ పరిస్థితులను అతను ఎంతో సమర్థతతో ఎదుర్కొన్నాడు. పదవి చేపట్టుతూనే పరిపాలనను క్రమబద్ధం చేసి, పాత పరిపాలనలో ఉండిన దురలవాట్లను రూపు మాపాడు. ముబారక్, ఖుస్రవ్‌లు ఖజానాను ఖాళీ చేసేశారు. అందుచేత అతను నిశితమైన విచారణ జరిపి అక్రమంగా మంజూరైన జాగీర్లు మొదలైన వాటిని రద్దు చేశాడు. ప్రజల క్షేమం నిమిత్తం ఎన్నో చర్యలు తీసుకున్నాడు. రాష్ట్రాలలో నిజాయితీపరులైన గవర్నర్లను నియమించాడు. ఫలసాయంలో పదోవంతో, పదకొండోవంతో మించకుండా శిస్తులు ఏర్పాటు చేసి, అధికార దుర్వినియోగం జరగకుండా కట్టుదిట్టాలు చేశాడు. అధిక సంఖ్యాకులకు ఆశ్రయమైన వ్యవ

## 25. తుఘ్లక్ వంశం-ఘియాసుద్దీన్ తుఘ్లక్

సాయాన్ని ప్రోత్సహించాడు. పంట కాలవలు తవ్వించాడు. తోటలు వేయించాడు. బంది పోటు నుంచి వ్యవసాయదార్లను కాపాడ టానికి కోటలు నిర్మింపజేశాడు.

సుల్తాను న్యాయ, రక్షణ శాఖలలాటి ఇతర ప్రభుత్వ శాఖలను కూడా సంస్క రించాడు. దేశంలో శాంతి భద్రతలు కలిగించాడు. పేదలకు సహాయం ఏర్పాటు చేశాడు. మత సంస్థలనూ, కవులనూ పోషించాడు. అమీర్ ఖుస్రవ్ అనే చరిత్ర కారుడు అతని ఆస్థాన కవిగా ఉండి, నెలకు వెయ్యి "తనకా"లు తీసుకునేవాడు. తపాలా, సైనికశాఖలు కూడా చక్కబడ్డాయి.

సామ్రాజ్య సంరక్షణలోనూ, సైనిక బలంతో ఆధిపత్యం కొనసాగించటంలోనూ ఇతను ఖల్జీల పద్ధతినే అనుసరించాడు. అలాఉద్దీన్ అనంతరం, వరంగల్లులో పరి పాలించిన కాకతీయ (రెండవ) ప్రతా పరుద్రుడు బలం చేకూర్చుకుని ఢిల్లీ ప్రభుత్వానికి కప్పం చెల్లించ నిరాకరించాడు. అందుచేత ఘియాసుద్దీన్ తాను సింహాసన మెక్కిన రెండవ సంవత్సరంలోనే తన పెద్ద కొడుకైన ఫక్రుద్దీన్ ముహమ్మద్ జౌనఖాన్ ఆధిపత్యం కింద ఒక బలాన్ని వరంగల్లు పైకి పంపాడు. ఈ దాడి కుట్రల వల్లనో, ఢిల్లీ సేనలు అంటు వ్యాధులకు గురి



కావటం చేతనో విఫలమయింది. యువరాజు జౌన ఢిల్లీకి తిరిగివెళ్ళాడు.

మరి నాలుగు మాసాల అనంతరం అతని నాయకత్వాన వరంగల్లు పై మరొక దాడి జరిగింది. ఈసారి ప్రతాపరుద్రుడు ఓడి, సకుటుంబంగా శత్రువుకు లొంగిపోయాడు. జౌన ప్రతాపరుద్రుణ్ణి బందీగా ఢిల్లీకి పంపి, వరంగల్లుకు సుల్తాన్‌పూర్ అని నామకరణం చేశాడు. కాకతీయరాజ్యం ఢిల్లీ సామ్రాజ్యంలో లీనం కాకపోయినప్పటికీ తన శక్తిని కోల్పోయింది.

బెంగాలులో గవర్నరుగా ఉండిన ఫీరూజ్ షా 1318 లో మరణించాడు. తరువాత అతని కొడుకుల మధ్య అంతః కలహం ఆరంభమయింది. వారిలో ఘియాసుద్దీన్ బహాదుర్ అనేవాడు సోనార్‌గాంవ్ రాజధానిగా పెట్టుకుని తూర్పు బెంగాలును స్వతంత్రంగా ఏలుతూ వచ్చాడు. లఖ్నౌతీ రాజధానిగా బెంగాలును ఏలుతూండిన తన తండ్రి స్థానాన్ని షిహాబుద్దీన్ బుఘ్రాషా అనే వాడు ఆక్రమించాడు. వీరిద్దరికీ నాసిరుద్దీన్ అనే మరొక కొడుకుకూ బెంగాలు రాజ్యం గురించి ఘర్షణ ఏర్పడింది. 1319 లో ఘియాసుద్దీన్ బుఘ్రాషాను ఓడించి బెంగాలు సింహాసనం లాక్కున్నాడు. నాసిరుద్దీన్ ఢిల్లీ సుల్తాను సహాయం అర్థించాడు. 1324 లో సుల్తాను లఖ్నౌతీకి సేనతో వెళ్లి, ఘియాసుద్దీన్ బహాదుర్‌ను పట్టుకుని బందీ చేసి, నాసిరుద్దీన్‌ను పశ్చిమ బెంగాలుకు రాజును చేసి, ఉభయ బెంగాలులనూ ఢిల్లీకి సామంతరాజ్యాలు చేసుకున్నాడు.

ఆ తరవాత ఘియాసుద్దీన్ తుఘ్లక్ ఆట్టే కాలం జీవించలేదు. అతని కొడుకు జౌనా నిర్మింపజేసిన ఒక కొయ్య కట్టడం మీద ఉండగా అది కూలింది. దాని ఫలితంగా ఆయన 1325 ఫిబ్రవరి — మార్చిలో మరణించాడు. జౌనా తండ్రి మరణం చేజేతులా చేయించాడని కొందరి విశ్వాసం.





# మహాభారతం

ధర్మరాజు కుంతిని స్త్రీ జనంతో బాటు ఇంటికి తిరిగి పొమ్మని చెప్పగానే కుంతి తాను కూడా గాంధారీ ధృతరాష్ట్రుల వెంట వనవాసం పోతున్నట్టు బయట పెట్టింది. ఆమె ధర్మరాజుకు అతని తమ్ములనూ, ద్రౌపదినీ పేరు పేరా అప్పగించి, "గాంధారీ ధృతరాష్ట్రులు నాకు అత్తమామల వంటి వారు. వారిని సేవించుకుంటూ నేను కూడా తపస్సు చేస్తాను," అన్నది.

ఈ మాటలు విని ధర్మరాజు నివ్వెర పోయి, "ఇవేం మాటలు? నే నిందుకు ఒప్పుకోను. మమ్మల్నీ, ఈ రాజ్యాన్నీ విడిచి ఎలా పోతావు? అరణ్యంలో ఎలా నివసిస్తావు?" అన్నాడు. భీముడు, "అమ్మా, ఇలాటి ఉద్దేశం ఉన్నదానవైతే మా చేత ఇంత భయంకరమైన యుద్ధం ఎందుకు చేయించావు? ఇప్పుడు అరణ్యానికి ఎందుకు పోవలిసి వచ్చింది?" అన్నాడు.

పాండవులందరూ ఏడుస్తూ ఆమెను విడిచి పెట్టలేదు. ద్రౌపదీ సుభద్రలు కూడా ఆమె వెంట పడ్డారు. వారందరినీ చూసి కుంతి, "మీరు జూదంలో ఓడిపోయి సుఖ భ్రష్టులైపోయారని బాధ పడి మిమ్మల్ని యుద్ధానికి ప్రోత్సహించాను. నిండు సభలో ఈ ద్రౌపదికి జరిగిన అవమానం సహించ లేక మిమ్మల్ని ప్రోత్సహించాను. అంతే గాని స్వార్థంకోరి కాదు. నేను నా భర్తతో రాజ్యభోగాలన్నీ అనుభవించాను, దానాలు చేశాను. ఇక అడవిలో తపస్సు చేసుకుంటూ పుణ్యం సంపాదిస్తాను," అన్నది.

కుంతి నిశ్చయం గ్రహించి పాండవులు వెనక్కు తగ్గారు. అప్పుడు ధృతరాష్ట్రుడు గాంధారితో, "కుంతిని హస్తినాపురానికి తిరిగి వెళ్ళమను. పుణ్యం సంపాదించా లంటే రాజ్యంలో ఉండి కూడా సంపాదించ వచ్చు. దాన వ్రతాలు అపారమైన పుణ్యం

అట్ట చివరి బొమ్మ




కలిగిస్తాయి,'' అన్నాడు. గాంధారి కూడా ఎన్నో విధాల చెప్పి చూసింది. కాని కుంతి తన నిశ్చయం మార్చుకోలేదు. ఈ లోపుగా పాండవులూ, అంతఃపుర స్త్రీలూ వాహనాలలో తిరుగు ప్రయాణం కావటం గ్రహించి ధృతరాష్ట్రుడు తన ప్రయాణం సాగించాడు.

పాండవులు హస్తినాపురానికి తిరిగి వచ్చేసరికి ఆ నగరం ఉత్సవం ముగిసిన మర్నాడున్నట్టుగా వెలవెలపోతూ ఉన్నది.

ధృతరాష్ట్రుడు తన అనుచరులతో సహా పగలల్లా చాలా దూరం నడిచి గంగాతీరాన ఒక చోట నిలిచాడు. అక్కడ బ్రాహ్మణులు



అగ్నులు రగిల్చారు. ధృతరాష్ట్రుడు అగ్నిని ఉపాసించి, అస్తమించే సూర్యుణ్ణి అర్చించాడు. విదుర సంజయులు ఆయన కోసం దర్భలతో పక్క తయారు చేశారు. దానికి సమీపంలోనే గాంధారికీ, కుంతికీ దర్భలతో పక్కలు ఏర్పాటయాయి. తెల్లవార్లూ అగ్నులు ప్రజ్వలించాయి. బ్రాహ్మణులు వేదపఠనం చేశారు. ఆ రాత్రి సుఖంగా గడిచింది.

మర్నాడు వారు కాలకృత్యాలు నిర్వర్తించి, నిష్ఠతో తపశ్చర్యలు ప్రారంభించారు. కాని ఆ రోజు వారికి హస్తినాపుర పౌరులూ, వారి దుఃఖమూ మనసులో మెదులుతూనే ఉన్నది. విదురుడి సలహాపై ధృతరాష్ట్రుడు గంగాతీరాన నివాసం ఏర్పరచుకున్నాడు. అక్కడికి వనవాసం చేసే బ్రాహ్మణులూ, తదితరులూ వచ్చారు. ధృతరాష్ట్రుడు వారికి కథలు చెప్పి, తగిన రీతిని ఆదరించి పంపేశాడు. ఆ సాయంకాలం ఆయన గాంధారితో సహా గంగా స్నానం చేసి, అనేక విధులు నిర్వర్తించి, అగ్ని నారాధించాడు.

తరవాత ధృతరాష్ట్రుణ్ణి విదురుడు మొదలైన వారు కురుక్షేత్రానికి తీసుకుపోయారు. అక్కడ శతయూపుడనే రాజర్షి



ఉంటున్నాడు. కేకయవంశం వాడైన ఈ శతయూపుడు రాజ్యాన్ని తన కొడుకు కిచ్చి తపస్సు చేయవచ్చాడు. ధృత రాష్ట్రుడు శతయూపుణ్ణి కలుసుకున్నాడు. ఇద్దరూ కలిసి వ్యాసాశ్రమానికి వచ్చారు. అక్కడ ధృతరాష్ట్రుడు ఆరణ్యకవ్రతం ప్రారంభించి తపశ్చర్య సాగించాడు. కుంతీ, గాంధారీ కూడా వ్రత నిష్ఠ అవలంబించారు. ధృతరాష్ట్రుడు ఇంద్రియాలనూ మనసునూ నిగ్రహించి తీవ్రమైన తపస్సు చేశాడు. ఆయన చర్మం ఎముకలకు అంటుకు పోయింది. విదుర సంజయులు ఆయనకు సేవలు చేస్తూ వచ్చారు.

ఇలా ఉండగా ఒకనాడు ధృతరాష్ట్రుణ్ణి చూడటానికి నారదుడూ, పర్వతుడూ, దేవలుడూ, శిష్య సహితుడై వ్యాసుడూ, మరికొందరు మునులూ వచ్చారు. శత యూపుడు కూడా ఆ సమయంలో అక్కడే ఉన్నాడు. వచ్చిన వారందరికీ కుంతీదేవి విధ్యుక్తంగా అతిథి పూజ చేసి, సంతోష పెట్టింది. గోష్ఠి జరిగింది. అనేక కథలు చెప్పుకున్నారు. ఆ సందర్భంలో నారదుడు ధృతరాష్ట్రుడికి, తపస్సు చేత స్వర్గానికి వెళ్ళిన అనేకమంది రాజులను గురించి చెప్పాడు. శతయూపుడి తాత అయిన సహస్రచిత్యుడూ, భగదత్తుడి తాత అయిన



శైలాలయుడూ, మాంధాత కొడుకైన పురుకుత్సుడూ మొదలైన వారెందరో ఈ అరణ్యంలోనే తపస్సు చేసి స్వర్గం చేరుకున్నారనీ, అక్కడ వారిని చాలా సార్లు చూశాననీ నారదుడు చెప్పాడు.

"నీ తమ్ముడైన పాండురాజు స్వర్గంలో నాకు ఇంద్రుడికి చేరువలో కనిపిస్తూంటాడు. అతను ఎప్పుడూ నిన్ను గురించే ఆలోచిస్తాడు. నీవూ, గాంధారీ తపోమహిమ చేత అక్కడికి పోతారు. కుంతి కూడా భర్తను చేరుకుంటుంది. విదురుడు ధర్మరాజులో ఐక్యమవుతాడు. సంజయుడు నీతో బాటు స్వర్గానికి వస్తాడు," అని కూడా నారదుడు ధృతరాష్ట్రుడికి చెప్పాడు.

నారదుడు చెప్పిన ఈ మాటలు విని గాంధారీ ధృతరాష్ట్రులెంతో సంతోషించారు. వారితోబాటు అక్కడ చేరిన వారందరూ నారదుణ్ణి మెచ్చుకున్నారు. అప్పుడు శతయూపుడు నారదుడితో, "ఓ మహర్షీ, నీ మాటలు వినటం చేత ధృతరాష్ట్రుడికీ, నాకూ, ఇక్కడ ఉన్న వారందరికీ తపస్సు పైన అభిమానం ఎంతగానో పెరిగింది. ధృతరాష్ట్రుడు ఏయే ఉత్తమ లోకాలు పొందుతాడో వివరంగా తెలుసుకోవాలని ఉన్నది," అని అడిగాడు.

దానికి నారదుడు, "ధృతరాష్ట్రుణ్ణి గురించి ఇంద్రలోకంలో ప్రస్తావన జరిగినప్పుడు ఇంద్రుడే స్వయంగా చెప్పగా కొన్ని విషయాలు విన్నాను. ధృతరాష్ట్రుడికింకా మూడేళ్ళాయు వున్నది. ఆ తరవాత ఇతడు గాంధారితో కూడా కుబేరుడి భవనానికి పోతాడు. కామగమనం గల విమానమెక్కి, దివ్యాభరణాలు ధరించి, దేవలోకాలన్నీ స్వేచ్ఛగా సంచరించ గలుగుతాడు," అని చెప్పాడు.

ఈ మాటలకు ధృతరాష్ట్రుడు పరమానందం చెందాడు. తరవాత వచ్చిన మహామునులందరూ తిరిగి వెళ్ళిపోయారు.






## 28

[బ్రహ్మదండి మాంత్రికుడు, కేశవుడూ వాళ్ళు, కొండ గుహల్లో దాగి వున్నారని గ్రహించాడు. ఆ వెంటనే అతడు స్థూలకాయుణ్ణి కొండ దగ్గిరకు పంపి, తామంతా అతడికి బానిసలుగా దొరికినట్టు, కేకలు వేయించాడు. అది విన్న కేశవుడూ అతడి అనుచరులు గుహ నుంచి బయిటికి వచ్చి, స్థూలకాయుడి కేసి పాకుతూ రాసాగారు. తరవాత—]

కేశవుడు నిశ్శబ్దంగా పాకుతూ పోయి, స్థూలకాయుడు నిలబడి వున్న రాతి వెనక ఆగి, కత్తిని అతడి కాళ్ళకు అడ్డంగా ఆనించి, "స్థూలకాయా! చెప్పేది నిశ్శబ్దంగా విను. అటూ యిటూ గెంతటంగాని, నీ వెనక ఎవరో వున్నట్టు సూచనగాని చేశావో, నీ రెండు కాళ్లూ ఒక్క వేటుకు తెగిపోగలవు," అన్నాడు గొంతు తగ్గించి మాట్లాడుతూ.

స్థూలకాయుడు ఒక క్షణకాలం స్తంభించిపోయాడు. తరవాత నిలువెల్లా ఓసారి వణికిపోయాడు. ప్రాణభీతితో ఒక్కసారిగా అరుద్దామనుకున్నాడు గాని, కేశవుడి హెచ్చరికా, పదునుగా కాళ్ళకు ఆనించబడి ఒరుసుకుంటున్న కత్తీ, అతడి బుద్ధిని అదుపులో పెట్టినై.

"ఎవరు నువ్వు? కేశవుడివి కాదు గదా?" అన్నాడు స్థూలకాయుడు వినపడీ వినపడనట్టు.

"నేను కేశవుణ్ణే! నా వెనక పదీ పదిహేను మంది కత్తులవాళ్ళూ, బాణాల



వాళ్ళూ వున్నారు. కదిలావో, చచ్చినవాడివే! ఇక చెప్పు! నువ్వు, నిజంగా బ్రహ్మదండి మాంత్రికుణ్ణీ ఆ పక్షివేషంవాణ్ణీ బానిసలుగా పట్టుకున్నావా? లేక అంతా కపట నాటకమా?" అని ప్రశ్నించాడు కేశవుడు.

"అంతా కపట నాటకమే. ఆడేది నేనైనా, ఆడిస్తున్నవాడు ఆ మాంత్రిక వెధవ. ప్రాణ భయం కొద్దీ వాడు చెప్పినదానికి ఒప్పుకున్నాను. నన్ను చంపకు, నీ పుణ్యముంటుంది," అంటూ స్థూలకాయుడు బావురుమన్నాడు.

స్థూలకాయుడు బొమ్మలా కదలామెదలక నిలబడి వుండి, పెదాలు మాత్రం ఆడిస్తూ ఏవో ధ్వనులు చేస్తూ వుండటం, అల్లంత దూరంలో వున్న చెట్ల చాటు నుంచి గమనిస్తున్న బ్రహ్మదండికీ, పులుగు రాయుడికీ ఆశ్చర్యం కలిగించింది.

"వాడట్టా ఎండు మానులా నిర్ర నిగడదీసుకు పోయాడేం? ఏదైనా గుర్రపు వాత రోగం కాదుగదా?" అన్నాడు పులుగు రాయుడు కోపంగా.

బ్రహ్మదండి ఆ ప్రశ్నకు అడ్డంగా తలాడిస్తూ, "అలాంటిదేం కాదని నా అనుమానం. వాడు మనం వేసిన గాలం! ఆ గాలానికి చేప పడిందని నాకు తోస్తున్నది. అయినా సంశయం ఎందుకు? ఒకసారి సౌంజ్ఞ చేసి చూద్దాం. జవాబు వస్తుందో లేదో తెలిసిపోతుంది," అంటూ తన మంత్రదండాన్ని పైకెత్తి, స్థూలకాయుడి కేసి ఆడించాడు.

బ్రహ్మదండికి జవాబిచ్చేందుకు స్థూలకాయుడు తన చేయి ఎత్తబోయి, అంతలో కేశవుడి కత్తి కాళ్ళను మరింత గట్టిగా ఒరుసుకోవటంతో ఆగిపోయాడు.

కేశవుడు తన పక్కనే వున్న జయమల్లూ, కోయగోమాంగ్‌ల కేసి తల తిప్పి, "వీడేదో తన మిత్రులకు చెప్ప చూస్తున్నట్టున్నది," అన్నాడు.



"అందుకు సందేహం లేదు. కాని, మనకు రానున్న ప్రమాదం ఆలోచించావా? ఆ బ్రహ్మదండీ, పక్షి ముఖం వాడూ యీ సరికే మనను పట్టేందుకు, తమ అను చరులతో బయలుదేరి వుండవచ్చు," అన్నాడు జయమల్లు.

కేశవుడు తన కత్తిని స్థూలకాయుడి మోచేతికి ఒకసారి తాకించి, "నిజం చెప్పక పోయావో, నీ కాళ్ళతోపాటు, చేతులు కూడా నరికేస్తాను. ఇప్పుడు బ్రహ్మదండీ, పక్షిముఖం వాడూ ఏం చేస్తున్నారు?" అని అడిగాడు.




"వాళ్ళిద్దరూ తల లోక చోట చేర్చారు; ఏదో రహస్యాలోచన చేస్తున్నట్టున్నది. జిత శక్తివర్మలు తమ కత్తుల్ని చెట్టు బోదె మీద సాన బెడుతున్నారు," అన్నాడు స్థూల కాయుడు. వాడు చెప్పిన దాంట్లో అబద్ధం ఏమీ లేదు. బ్రహ్మదండీ, పులుగురాయుడూ కలిసి ఆసరికే కొందరు రెక్కల మనుషుల్ని, శత్రుబలమేపాటో తెలుసుకు వచ్చేందుకు పంపారు. వాళ్ళల్లో కొందరు పెద్ద పెద్ద వృక్షా లెక్కి, అక్కణ్ణించి రాతి మీద నిల బడి వున్న స్థూలకాయుణ్ణీ, ఆ వెనక నక్కి వున్న కేశవుణ్ణీ, జయమల్లునూ, కోయ గోమాంగ్‌నూ చూశారు.

"ఇంతకూ శత్రువులు ముగ్గురే ముగ్గురు! పిల్లి కూనల్ని పట్టినట్టు వాళ్ళను మెడలు పట్టి యివతలికి యీడ్చవచ్చు," అనుకుంటూ రెక్కల మనుషులు తమ నాయకుడి దగ్గిరకు పరిగెత్తుకు వెళ్ళి, తాము చూసింది చెప్పారు.

తన అనుచరులు యిచ్చిన భోగట్టా వింటూనే, పులుగురాయుడు కనుబొమలు ముడిచి, "ఇందులో ఏదో పెద్ద మోసం వున్నది, బ్రహ్మదండీ! ముగ్గురే ముగ్గురు మానవ మాత్రులు, యింత ధైర్యంగా మన మధ్యకు వస్తారంటే నేను చచ్చినా నమ్మను," అన్నాడు.



"వాళ్ళ సంగతి తెలియకపోతే నేనూ నమ్మను!" అంటూ బ్రహ్మదండి పెద్దగా నవ్వి, "వాళ్ళల్లో ఒకడు కేశవుడూ, రెండవ వాడు జయమల్లనే నా పూర్వ శిష్యుడూ. పోతే, ఆ మూడవవాడు కోయశుంఠ అయి వుంటాడు. ఆ ముగ్గురూ మహిష లగ్నంలో పుట్టినవాళ్ళు. ఆ జాతకులకు వెనక చూపూ వుండదు, ముందు చూపూ వుండదు. ఏటికి అడ్డంపడి యీదటమే," అన్నాడు.

"అయితే యిప్పుడు మనం చేయవలసిం దేమిటి?" అన్నాడు పులుగురాయుడు.

"ఏముంది, వాళ్ళ ముగ్గుర్నీ చుట్టు ముట్టి పట్టేద్దాం," అన్నాడు బ్రహ్మదండి.

"వాళ్ళూ, బాణాలూ, కత్తులూ వెంట వుంచుకు తిరిగేవాళ్ళే. అంత తేలిగ్గా దొరుకు తారని నేననుకోను. మనలో చాలామందికి చావ వలసి వస్తుంది. ముందు ఆ స్థూల కాయుణ్ణి వాళ్ళు చంపేస్తారు," అన్నాడు పులుగురాయుడు.

"వాడు నరభక్షకులకు దొరికి ఎప్పుడో చచ్చినవాడే, నేను ప్రాణం పోసి వెంట పెట్టుకు వచ్చాను. ఇవ్వాళితో వాడికి ఆయుష్షు తీరిపోయిందనుకుందాం! పోతే, నువ్వూ నేనూ ఎంతో కాలం బతికి వుండి, అర్ధరాజ్యమూ, రాకాసిలోయలోని ధన రాసులూ అనుభవించ వలసిన వాళ్ళం. అందువల్ల మనం తొందరపడి, ఆ దుర్మా ర్గుల బాణం వేటుకు అందే దూరంలోకి వెళ్ళకూడదు. నీ నా అనుచరుల్ని, వాళ్ళను పట్టి తెచ్చేందుకు పంపుదాం," అన్నాడు బ్రహ్మదండి మాంత్రికుడు.

"అంతే చేద్దాం," అంటూ పులుగు రాయుడు పక్కకు తిరిగి తన అనుచరు లకు సౌంజ్ఞ చేశాడు. వెంటనే ముప్పై నలభై మంది రెక్కల మనుషులు తమ నాయకుడి దగ్గిరకు వచ్చారు. పులుగురాయుడు వాళ్ళతో కొంచెంసేపు రహస్యంగా మాట్లాడి, యిక వెళ్ళమన్నట్టు చేతులు వూపాడు.



రెక్కల మనుషులు రెండు ముఠాలుగా చీలిపోయి, కొందరు చెట్ల మీదికి ఎక్క సాగారు. మరి కొందరు రాళ్ళ వెనక నక్కుతూ, స్థూలకాయుడున్న ప్రదేశానికి బయలుదేరారు.

"ఏం, జితా, శక్తీ! మీ రిక్కడే వున్నా రేం? ఆ కేశవుడూ వాళ్ళను పట్టేందుకు సాయపడరా?" అని అడిగాడు పులుగు రాయుడు జిత శక్తివర్మలను.

ఆ ప్రశ్న వింటూనే జిత శక్తివర్మలు పదును పెడుతున్న కత్తులను ఒరలలో పెట్టి, "ఆ నీచుల్ని పట్టుకుని, మా చేతుల్ని మలినం చేసుకుంటామా! మా పని బ్రహ్మ దండి మాంత్రికుడి అంగరక్షణ చేయటం. బ్రహ్మపుర రాజగురువు మమ్మల్ని పంపింది అందుకేగదా, బ్రహ్మదండీ?" అంటూ మాంత్రికుణ్ణి ప్రశ్నించారు.

బ్రహ్మదండి వచ్చే కోపాన్ని దిగ మింగుతూ, "అవును, అవును," అంటూ తలాడించి వూరుకున్నాడు.

ఈలోపల రెక్కల మనుషులు తమ మీద దాడికి వస్తున్నట్టు ముందుగా చూసి కేశవుడికీ జయమల్లుకూ కోయగోమాంగ్ హెచ్చరిక చేశాడు. మహావృక్షాల మీదికి పాకిపోతున్న వాళ్ళను చూస్తూనే కేశవుడు



నవ్వి, "ఈ పక్షి వెధవలు అంత ఎత్తు నుంచి, మన మీదికి దూకి, మనను పట్టు కుంటారన్నమాట! సరే, బాణాలు ఎక్కు పెట్టి, ముందు ఒకళ్ళిద్దర్ని పడకొట్టండి, మిగతా వాళ్ళు పారిపోతారు. ఇంతకూ వీళ్ళ నాయకులెక్కడ?" అన్నాడు, విల్లంబులు చేతికి తీసుకుంటూ.

ఆ వెంటనే జయమల్లూ, గోమాంగ్ కూడా తమతమ విల్లంబులు తీసుకున్నారు. కేశవుడు చెట్ల మీదికి పాకుతున్న ఒక రెక్కల మనిషి మీదికి గురిపెట్టిన బాణాన్ని చప్పున దించుతూ, జయమల్లుకేసి తిరిగి, "జయమల్లూ! వీళ్ళ నెంతమందిని చంపినా




మనకు కలిగే మేలులేదు. ఆ బ్రహ్మదండిని ముందు మారణం చెయ్యాలి. వాడెక్కడ? వాడూ మన మీదికి వస్తున్నాడా? ఏయ్, స్థూలకాయా! బ్రహ్మదండి యిటుకేసి వస్తున్నాడా? నిజం చెప్పు,'' అని స్థూలకాయుణ్ణి ప్రశ్నించాడు.

స్థూలకాయుడు నిలువెల్లా వణికిపోతూ, "వాడు రావటంలేదు. వాడూ, పిట్టల నాయకుడూ చెట్ల కింద నిలబడి యిటుకేసే చూస్తున్నారు,'' అన్నాడు.

"ఆ దుర్మార్గుడికి మన శక్తేమిటో తెలుసు, కేశవా! సరే, యిక మనం యిక్కడ కాలయాపన చెయ్యకూడదు. ఇద్దరు ముగ్గురు రెక్కల మనుషుల్ని పడకొట్టి, మనం గుహ కంతలో నుంచి తిరిగీ కొండ పొట్టలోకి వెళ్ళిపోదాం,'' అంటూ జయమల్లు బాణం గురి చేసి చెట్ల మీదికి చరచరా పాకిపోతున్న రెక్కల మనుషుల్లో ఒకడి మీదికి దాన్ని వదిలాడు.

కేశవుడూ, అతడి అనుచరులు తమ దృష్టిని రెక్కల మనుషుల మీదికి మళ్ళించారని గ్రహించిన స్థూలకాయుడు రాతి మీది నుంచి ఛెంగున కిందికి దూకి, కాలి సత్తువ కొద్దీ, బ్రహ్మదండీ, పులుగురాయుళ్ళకేసి పరిగెత్తుతూ, "వాళ్ళు అంతా కలిసి ముగ్గురే! చంపండి, పట్టుకోండి,'' అంటూ అరవసాగాడు.

"ఆహాఁ, కేశవా! ఈ దుర్మార్గుడు మన నుంచి బతికి బయటపడ్డాడు. అయినా, ఒక దెబ్బ కొట్టి చూద్దాం, తగులుతుందేమో!'' అంటూ కోయగోమాంగ్ లేచి నిలబడి పారిపోతున్న స్థూలకాయుడి మీదికి బాణం వదిలాడు. కాని, ఆ బాణం స్థూలకాయుడి పక్కగా దూసుకుపోయి, బ్రహ్మదండీ, పులుగురాయుడూ నిలబడివున్న చెట్టు బోదెకు తపీ మని తగిలింది.

బాణం చేసిన ధ్వని వింటూనే బ్రహ్మదండి ఎగిరి గంతేసి, "ఆ దుర్మార్గులు

ముగ్గురూ మన మీదికే బాణాలు వదులుతున్నారు పులుగేంద్రా! పరిగెత్తు!" అంటూ వెను దిరిగి చెట్లలోకి పారిపోసాగాడు. పులుగురాయుడూ, జిత శక్తివర్మలూ అతణ్ణి అనుసరించారు.

గోమాంగ్‌తో పాటు కేశవుడూ, జయమల్లూ కూడా లేచి నిలబడ్డారు. వాళ్ళకు పారిపోతున్న బ్రహ్మదండి ముఠా కనిపించింది. వాళ్ళను వెంట పడి తరమటమా, మానటమా అని వాళ్ళు ఆలోచించేంతలో చెట్ల మీది నుంచి, చావగా మిగిలిన రెక్కల మనుషులు భయంకరంగా అరుస్తూ, వాళ్ళ మీదికి ఎగిరి రాసాగారు.

కేశవుడూ, అతడి అనుచరులు బాణాలు ఒక దాని వెంట ఒకటిగా కిందికి దూకుతున్న రెక్కల మనుషుల మీదికి వదిలారు. వాళ్ళల్లో బాణం దెబ్బలు తగిలిన కొందరు బాధతో అరుస్తూ, అంత ఎత్తు నుంచి గాలిలో పల్లటీలు కొడుతూ కిందపడసాగారు.

ఇక తిరిగి తాము గుహలో ప్రవేశిద్దామని కేశవుడూ, జయమల్లూ నిశ్చయించుకుని వెనుదిరిగేంతలో, రెక్కల మనుషుల్లో రెండవ ముఠా రాళ్ళ చాటు నుంచి ఒక్కుమ్మడిగా గావు కేకలు పెడుతూ, లేచి నిలబడ్డారు. వాళ్ళందరి వద్దా పొడవైన ఈటెలు వున్నవి.



"ఇక బాణాలతో లాభం లేదు, కత్తులకు పని చెప్పండి. శత్రువులు మన గుహా మార్గాన్ని అడ్డుకున్నారు. పోరాడుతూ వీళ్ళ చక్రబంధం నుంచి బయట పడటం ఒక్కటే యిప్పుడు మనం చేయవలసింది. మనం వీళ్ళకు దొరక్కుండా ఎటు పారిపోయినా ఫరవా లేదు," అంటూ జయమల్లు కత్తి దూసి రెక్కల మనుషుల్ని ఎదుర్కొన్నాడు.

కేశవుడూ, గోమాంగ్, జయమల్లుల కత్తి దెబ్బలకు రెక్కల మనుషుల్లో ఒక్కొక్కడే చావు కేక పెట్టి కింద పడసాగాడు. వాళ్ళు చేతులకు కట్టు కున్న పక్షి రెక్కలు, ఈ ద్వంద్వ యుద్ధంలో వాళ్ళకు చాలా ఆటంకంగా తయారయినై. వాళ్ళల్లో కొందరు ఈకెలను అటూ యిటూ తిప్ప బోయి, ఆ వేగానికి కట్టుకున్న రెక్కలు ఒక దాన్నొకటి మెలివేసు కోవటంతో, చాప చుట్టల్లా కింద పడసాగారు.

"మనం జయించాం, కేశవా! ఇక, మనం గుహలోకి ప్రవేశించి, క్షేమంగా శ్వాన కర్ణి ముఠాను చేరవచ్చు," అంటూ జయమల్లు అటుకేసి రెండడుగులు వేసి నిశ్చేష్టుడైపోయాడు.

ఎదురుగా దడి కట్టినట్టు నిలబడిన తన అనుచరులతో పులుగురాయుడు ప్రత్యక్షమయాడు. జయమల్లుతో పాటు, కేశవుడూ, కోయగోమాంగ్ కూడా అటుకేసి చూసి, తరవాత చుట్టూ కలయచూశారు. వలయాకారంలో తమను రెక్కల మనుషులు వందల సంఖ్యలో చుట్టు ముట్టినట్టు వాళ్లు గ్రహించారు. బ్రహ్మదండి ఎక్కడ? అన్న అనుమానం వాళ్ళకు కలిగింది. ఆ వెంటనే బ్రహ్మదండి మాంత్రికుడి కంచు కంఠం పలికింది: "ఆ కేశవుణ్ణి మాత్రం ప్రాణాలతో పట్టుకుని, మిగతా యిద్దర్నీ నిలువునా నరికేయండి!" —(ఇంకా వుంది)





# అభూత కల్పనలు

ఒక గ్రామంలో నలుగురు కుర్రాళ్ళుండే వారు. వారు ఎప్పుడూ ఏవో విడ్డూరాలు కల్పించి మాట్లాడుతూ ఉండేవారు.

ఒకనాడు గ్రామం చివర ఉండే సత్రానికి పొరుగూరి వాడొకడు రావటం వాళ్ళు చూశారు. ఆ మనిషి మంచి బట్టలు కట్టుకుని ఉన్నాడు. ఆ బట్టలు కాజెయ్యాలని నలుగురు కోతలరాయుళ్ళకూ కోరిక కలిగింది. అందు కోసం వాళ్ళు సత్రానికి వెళ్ళి పొరుగూరి వాణ్ణి పలకరించి, అదీ ఇదీ మాట్లాడారు.

చివరకు కోతలరాయుళ్ళలో ఒకడు, "ఒక చిన్న పందెం వేసుకుందాం. ఒక్కొక్కడూ తనకు కలిగిన వింత అనుభవాన్ని చెప్పాలి. వినేవాళ్ళలో ఎవడైనా ఆ అనుభవాన్ని నమ్మకపోతే, నమ్మనివాడు కథ చెప్పిన వాడికి దాసుడైపోవాలి," అన్నాడు. ఇందుకు పొరుగూరి వాడు కూడా ఒప్పుకున్నాడు. కోతలరాయుళ్ళు సంతోషించారు. ఎందుకంటే వాళ్ళు చెప్పే కథలు ఎవరికీ నమ్మశక్యంగా ఉండవు, పొరుగూరి వాడు తప్పక దొరికిపోతాడు—అని కోతలరాయుళ్ళ నమ్మకం.

మొదటివాడు తన కథ ఇలా చెప్పాడు:

"మా అమ్మ నన్ను కడుపుతో ఉండి, మా ఇంటి కెదురుగా ఉన్న నేరేడుచెట్టు పళ్ళు తినాలని ఉన్నదని మా నాన్నతో అన్నది. అంత ఎత్తు చెట్టు తాను ఎక్కలేనని మా నాన్న అన్నాడు. మా అన్నల నడిగితే వాళ్ళూ అలాగే చెప్పారు. నాకు జాలివేసి, మా అమ్మ కడుపులో నుంచి బయటికి వచ్చి, నేరేడుచెట్టెక్కి, పళ్ళన్నీ కోసి తెచ్చి వంట ఇంటో దాచిపెట్టాను. తరవాత ఏమీ ఎరగనట్టు మళ్ళీ మా అమ్మ కడుపులో దూరాను. తరవాత మా అమ్మ తనకు కావలిసినన్ని తిని, మిగతావి

టి. సూర్యారావు




ఊరంతా పంచిపెట్టి, అప్పటికీ మిగిలిన పళ్ళు ఇంటి ముందు పారేస్తే అవి ఇల్లంత ఎత్తు గుట్ట అయి, వీధిలో నుంచి ఇల్లు కన పడకుండా పోయింది."

ఈ కథ చెప్పి కోతలరాయుడు పారు గూరి వాడి కేసి చూశాడు. పారుగూరివాడు తాను కథ నమ్మినట్టుగా తల ఆడించాడు. మిగిలిన ముగ్గురు కోతలరాయుళ్ళూ తలలు ఆడించారు.

అప్పుడు రెండో కోతలరాయుడు ఈ విధంగా కథ చెప్పాడు :

"నేను వారం రోజుల వయసువాణ్ణయి ఉండగా అడవికి షికారు వెళ్ళాను. అక్కడ ఒక చింతచెట్టు కనిపించింది. దాని నిండా పండిన చింతకాయలున్నాయి. నాకు ఆక లిగా ఉండటంచేత వెంటనే చెట్టెక్కి కడుపు నిండా చింతగుల్లలు తిన్నాను. దాంతో పొట్ట బరువెక్కి, నిద్రమత్తు వచ్చేసి కిందికి దిగటం అసాధ్యమయింది. అందుకని నేను ఊళ్ళోకి వెళ్ళి ఒక నిచ్చెన పట్టుకొచ్చి చింతచెట్టుకు వేసి, దాని మీదుగా దిగి వచ్చాను. ఇంకా నయం, నాకు ఊళ్ళో నిచ్చెన దొరికింది; లేకపోతే ఆ చెట్టు మీద ఉండిపోవలిసినవాణ్ణే!"

ఇది కూడా నమ్మినట్టుగానే పారుగూరి వాడు తల ఆడించాడు. మిగిలిన ముగ్గురు కోతలరాయుళ్ళూ తలలు ఆడించారు.

అప్పుడు మూడో కోతలరాయుడు ఈ విధంగా కథ చెప్పాడు:

"నేను మాంచి కుర్ర వయసులో ఒక నాడు కుందేలు లాటిది కనిపిస్తే దానివెంట పడ్డాను. అది కాస్తా ఒక పొదలో దూరింది. దాని వెనకగా నేను కూడా పొదలో దూరి చూతును గదా, అదొక పెద్దపులి. అది నన్ను మింగాలన్న ఉద్దేశంతో నోరు తెరి చింది. నన్ను మింగటం అన్యాయమనీ, అది కుందేలనే పొరపాటుతో దాన్ని తరిమా ననీ మంచిగా చెప్పాను. అది నా మాట

వినిపించుకోక, నోరు తెరిచి నాపైకి వచ్చింది. నాకు చిరాకెత్తి ఎడమచేత్తో దాని పై దవడ పట్టుకుని పైకి ఒక్క గుంజు గుంజాను. ఆ దెబ్బతో పులి రెండుగా విరిగి చచ్చి ఊరుకుంది."

ఈ కథ కూడా తాను నమ్మినట్టే పారు గూరి వాడు తల ఆడించాడు. మిగిలిన ముగ్గురు కూడా తలలు ఆడించారు.

అప్పుడు నాలుగో కోతలరాయుడు తన కథ ఇలా చెప్పాడు:

"కిందటేడు చేపలవేటకు వెళ్ళాను. ఒక్క చేప కూడా దొరికింది కాదు. మిగిలిన పల్లెవాళ్ళ నడిగితే తమకు కూడా చేప అన్నది చిక్కలేదన్నారు. నది అడుగున ఏదో జరుగుతూ ఉండి ఉంటుంది, అదే మిటో చూతామని నేను నా పడవలో నుంచి నీటిలోకి దూకాను. నది అడుగున కొండంత చేప ఒకటి ఉండి ఇతర చేపలన్నిటినీ తినేస్తున్నది. ఒక్క గుద్దుతో ఆ పెద్ద చేపను చంపేశాను. ఆకలి దహించుకు పోతూం డటం వల్ల నేను అక్కడే నిప్పు రాజేసి ఆ చేపను కాల్చేసి దాన్ని సాంతం తినే శాను. తరవాత నీటి పైకి వచ్చి, నా పడ వలో ఎక్కి ఇల్లు చేరుకున్నాను."

ఈ కథను కూడా నమ్మినట్టే పారుగూరి వాడు తల ఆడించాడు. మిగిలిన ముగ్గురు



కోతలరాయుళ్ళు కూడా విధిగా తలలు ఆడించారు.

ఇప్పుడు పొరుగూరి వాడికి కథ చెప్పే వంతు వచ్చింది. వాడు ఈ విధంగా చెప్పాడు:

"కొంతకాలం కిందట నా కొక పత్తి తోట ఉండేది. అందులో ఒక పత్తి చెట్టు మరీ పెద్దది. ఎర్రగా ఉండేది. మొదట్లో దాని కొక ఆకుగాని, కొమ్మగాని లేదు. తరవాత అది నాలుగు కొమ్మలు వేసింది. ఒక్కొక్క కొమ్మకూ ఒక్కొక్క కాయ కాసింది. నాలుగు కాయలూ కోసి పగల దీసేసరికి నాలుగింటి నుంచీ నలుగురు యువకులు బయటికి వచ్చారు. వారు నా పొలంలో కాసిన కాయలలో వాళ్ళు గనక నలుగురూ నాకు బానిసలే. వాళ్ళచేత పొలంలో పని చేయించాను. వట్టి సోమరిపోతులు కావటం చేత, కొద్ది వారాలు పని చేసి వారు పారి పోయారు. వారిని వెతుకుతూ బయలుదేరి చివరకు ఇక్కడ వాళ్ళని పట్టుకున్నాను. మీరే ఆ నలుగురూనూ. నా వెంట నా పొలానికి వచ్చెయ్యండి!"

ఈ కథ విని నలుగురు కోతలరాయుళ్ళూ తలలు దించేసుకున్నారు. వాళ్ళకు పెద్ద చిక్కే వచ్చింది. కథ నిజమని ఒప్పుకుంటే తాము ఆ పొరుగూరి వాడి బానిసలని ఒప్పు కోవాలి. కథ అబద్ధమంటే పందెం ప్రకారం అతడికి దాసులు కావాలి.

సత్రంలో ఉన్న ఇతరులు కోతల రాయుళ్ళను, "ఆ కథ నిజమో, అబద్ధమో చెప్పరేం?" అని అడిగారు. కాని వారు ఏ సమాధానమూ చెప్పక మూగవాళ్ళలా చూస్తూ వూరుకున్నారు.

"సరే, మీ వంటి మీద ఉన్న బట్టలు నా కిచ్చెయ్యండి. నేను మీకు స్వేచ్ఛ ఇస్తాను," అని పొరుగూరు వాడు వాళ్ళ బట్టలు పుచ్చుకుని ఆ వూరు విడిచి తన దారిన వెళ్ళి పోయాడు.



# పవిత్రమైన దేవాలయం

ఒక గ్రామంలో ఒక దేవాలయానికి ధర్మకర్త ఉండేవాడు. ఆయన ఊరి వారికి పురాణం చదివి వినిపించేవాడు. ఒకనాడాయన పురాణం చదువుతూ, "జ్ఞాని అయిన వాడి దృష్టిలో అంతా ఈశ్వరుడే. వీడు బ్రాహ్మణుడనీ, వీడు చండాలుడనీ పామరులు విచక్షణ కల్పించుకుంటారు, అది గ్రహించిన వాడే నిజమైన జ్ఞాని," అని చెప్పాడు.

దూరంగా ఉండి ఈ మాటలు విన్న అస్పృశ్యు డొకడు పురాణం పూర్తి కాగానే ధర్మకర్తతో, "అయితే, స్వామీ, నన్ను దేవాలయంలోకి రానివ్వటానికి అభ్యంతర మేమిటి? తమరు జ్ఞాని కదా! తమకు తేడా లేమీ లేవుగదా!" అన్నాడు.

ధర్మకర్త బిత్తరపోయి, "నేను జ్ఞానినే ననుకోరా. ఆలయంలో దేవుడు అనుమతించవద్దా? దేవుడేమంటాడో అడిగి తెలుసుకుంటాను. కొంచెం ఓపికపట్టు," అన్నాడు.

అస్పృశ్యుడు కొన్నాళ్ళ తరవాత ధర్మకర్త వద్ద ఈ విషయం మళ్ళీ తెస్తే ఆయన, "ఇంకా దేవుడు నా కేమీ చెప్పలేదురా!" అన్నాడు.

మరి కొన్నాళ్ళ తరవాత మళ్ళీ ఇద్దరూ కలుసుకున్నప్పు డాయన, "నీ కోరిక విషయం దేవుణ్ణి ఎన్నిసార్లు అడిగినా, దేవుడేమీ చెప్పకుండా ఉన్నాడురా!" అన్నాడు.

దానికి అస్పృశ్యుడు, "ఆ మాట నాతో దేవుడే స్వయంగా చెప్పేశాడు లెండి," అని జవాబిచ్చాడు.

ధర్మకర్త ఆదుర్దాగా, "ఏం చెప్పాడేం?" అని అడిగాడు.

"'ఒరే, ఆ గుడిలోకి నన్నే రానివ్వటంలేదు, నిన్నెందుకు రానిస్తార్రా?' అని దేవుడు నాతో అన్నాడండి!" అన్నాడు అస్పృశ్యుడు.





# దివ్యౌషధం

ఒక దేశంలో ఒకరాజూ, రాణీ ఉండేవారు. వారిద్దరూ మూఢులే. రాణి తొలిసారిగా గర్భవతి అయి ఒక ఆడ శిశువును కన్నది. ఆ శిశువు కూనారిగా ఉండటమేగాక, దానికి తలపై వెంట్రుకలు లేవు, నోట్లో పళ్ళు లేవు.

"ఛీ, ఛీ, ఇదేం పిల్ల!" అన్నది రాణి అసహ్యించుకుంటూ.

"మనకు నాసిరకం పిల్ల పుట్టింది. ఈ సంగతి తెలిస్తే, నలుగురిలో ఎంత అవమానం!" అన్నాడు రాజు.

మంత్రులు రాజుతోనూ, రాణీతోనూ, "పుట్టినప్పుడు పిల్లలంతా ఇలాగే ఉంటారు," అని చెప్పి చూశారు.

"మా కళ్ళ నీళ్ళు తుడవటానికి బొల్లి కబుర్లు చెప్పవద్దు. దేశంలో ఉన్న వైద్యులందరినీ తక్షణం యిక్కడికి పిలిపించండి," అన్నాడు రాజు. వైద్యులందరూ రాజు దగ్గిరికి వచ్చారు.

"మాకు కుమార్తె కలిగిన మాట నిజమే. గాని అది మరీ చిన్నదిగా ఉన్నది. దాని తలపై వెంట్రుకలు లేవు. నోట్లో పళ్ళు లేవు. మీరంతా దీనికి తగిన చికిత్స ఆలోచించి, మందు లిచ్చి, ఈ పిల్ల వెంటనే పెద్దదయేటట్టూ, దీని తలపై వెంట్రుకలుండేటట్టూ, నోట్లో పళ్ళుండేటట్టూ చెయ్యండి," అని రాజు వారితో అన్నాడు.

"మహారాజా, ఇది సాధ్యమయే పని కాదు," అన్నారు వైద్యులు.

"చక్రవర్తిని నేను ఆజ్ఞాపిస్తున్నాను. ఇంకా సాధ్యం కాకపోవటం ఎటువంటిది? నేను చెప్పినట్టు చెయ్యటానికి మీరు సమ్మతించక పోయారో మిమ్మల్నందరినీ బెత్తాలతో వీపులు చిట్లగొట్టిస్తాను. అయిదు నిమిషాలు వ్యవధి ఇస్తున్నాను, ఆలోచించుకోండి," అంటూ రాజు అవతలికి వెళ్ళిపోయాడు.

డి. పద్మనాభం

ఆయన అయిదు నిమిషాల అనంతరం తిరిగి వచ్చి, దీనంగా తలలు వంచుకుని వున్న వైద్యులతో, "ఏం నిర్ణయించారు? నా కూతురికి వైద్యం చేస్తారా? దెబ్బలు తింటారా?" అని అడిగాడు.

వైద్యు లెవరూ మాట్లాడ లేదు.

రాజు తన భటులను పిలిచి, "బెత్తాలతో వీరందర్నీ చావ గొట్టండి!" అని ఆజ్ఞాపించాడు.

అప్పుడొక వృద్ధవైద్యుడు, "మహారాజా, తొందర పడకండి. మీ ఆజ్ఞను శిరసావహించటానికి మేం సిద్ధంగానే ఉన్నాం. ఇందుకుగాను ఒక దివ్యౌషధం ఉన్నది. అది గనక ఇచ్చినట్టయితే రాజకుమార్తె పెరిగి పెద్ద దవుతుంది. ఆమెకు తలనిండా వెంట్రుకలూ, నోటి నిండా పళ్ళూ ఏర్పడతాయి," అన్నాడు.

"మంచిది. ఆ దివ్యౌషధం ఎక్కడ ఉన్నది?" అని రాజు అడిగాడు.

"అది సిద్ధంగా లేదు. దానిని తయారు చేసుకోవాలి. కొంత కాలం పడుతుంది," అన్నాడు వృద్ధ వైద్యుడు.

"కొంత కాలం పట్టటం దేనికి? నేను రాజును, రాజాధిరాజును, మహాచక్రవర్తిని. ఇప్పుడే ఆ దివ్యౌషధం నాకు కావాలి. అది



వెంటనే ఎందుకు తయారు కాదూ?" అన్నాడు రాజు.

"తమ రన్నది నిజమే, కాని ఆ దివ్యౌషధం తయారు చెయ్యటానికి నాలుగు వందల అరవై అయిదు రకాల మూలికలు కావాలి, మూడువందల పన్నెండు రకాల ధాతువులు తేవాలి," అన్నాడు వైద్యుడు.

రాజు గర్వంతో, "తప్పకుండా అన్ని దినుసులూ తెచ్చి దివ్యౌషధం తయారు చెయ్యండి. కాని దాన్ని వెంటనే తయారు చెయ్యండి," అన్నాడు.

"మహారాజా, అది అంత శీఘ్రం అయ్యే పని కాదు. రెండేళ్ళ కొకసారి పూసే

మూలిక ఉన్నది. అది నాలుగో విడత పూస్తూండగా ఏరుకు రావాలి. అలాగే, ఒక ధాతువు మంచుకొండల మీద తప్ప మరెక్కడా దొరకదు. ఆ కొండల మీద మంచు ఆరేళ్ళ కొకసారి మాత్రమే కరుగుతుంది. అలా రెండుసార్లు కరిగిన తరవాతనే ఆ ధాతువును తవ్వి తీసుకు రావాలి," అన్నాడు వైద్యుడు.

"సరే, సరే, ఇంతకూ ఆ దివ్యౌషధం ఒక వారంలో తయారవుతుందా?" అని రాజు అడిగాడు.

"ఇంకా ఎక్కువ కాలం పడుతుంది, మహారాజా. తమరు ఒక పని చేయగూడదా? మీ అమ్మాయిని పన్నెండేళ్ళ పాటు మా పెంపకంలో ఉంచండి. ఆమెకు చెయ్యవలసిన చికిత్స సక్రమంగా చేస్తాం," అన్నాడు వృద్ధ వైద్యుడు.

రాజు రాణి కేసి తిరిగి, "ఏమంటావు, దేవీ? మన అమ్మాయిని పన్నెండేళ్ళపాటు వీరి కిచ్చి చికిత్స చేయింతామా? లేక వీరందరినీ బెత్తాలతో చావ గొట్టించనా?" అని అడిగాడు.

రాణి కొంచెం ఆలోచించి, "వాళ్ళకు పన్నెండేళ్ళు వ్యవధి ఇచ్చి చూద్దాం. అప్పటికీ అమ్మాయికి చికిత్స చెయ్యలేక పోతే ఏకంగా అందరి తలలూ తీసెయ్యవచ్చు," అన్నది.

రాజు సరే నన్నాడు. వైద్యులు రాజకుమార్తెను తమ వెంట తీసుకుపోయి, ఆమెను శ్రద్ధగా పెంచటమేగాక, చదువు చెప్పి, ప్రపంచ జ్ఞానం కలిగించారు. ఆమె వారివద్ద పన్నెండేళ్ళు పెరిగి తల్లి దండ్రుల వద్దకు తిరిగి వచ్చింది. ఆమె తల మీద నల్లని తలకట్టూ, నోట్లో తెల్లని పలు వరుసా చూసి, రాజూ రాణీ ఎంతో సంతోషించి వైద్యులకు గొప్ప బహుమానా లిచ్చారు. వారి అనంతరం రాజకుమార్తె రాణీ అయి ప్రజలను వివేకంతో పాలించింది.





# మూడు సూత్రాలు

ఒక గురుకులంలో ఒక పేద విద్యార్థి ఉండే వాడు. గురువుగారు ఇతర విద్యార్థులతో బాటు అతనికీ చదువు చెప్పాడు. కాని దుర దృష్టవశాత్తూ పేద విద్యార్థికి చదువు కొంచ మైనా అంటలేదు. శిష్యు లందరూ చదువు పూర్తి చేసి వెళ్ళిపోయేటప్పుడు గురువు గారు పేద శిష్యుడితో, "నాయనా, నీతో బాటు నా వద్ద చదివిన వారందరూ పండితు లయారు. నీ దురదృష్టమో, నా దుర దృష్టమో, నీకు మాత్రం కొంచెం కూడా చదువు అబ్బ లేదు. నీకు మూడు సూత్రాలు చెబుతాను. అదృష్టం ఉంటే నీవు కూడా బాగుపడవచ్చు," అని చెప్పి, మూడు సూత్రాలు చెప్పాడు. అవి ఏవంటే:

నడవగా నడవగా అదే వస్తుంది.

అడగగా అడగగా అదే తెలుస్తుంది.

మెలకువగా ఉంటే మరణ భయం ఉండదు.

గురువుగారు చెప్పిన ఈ మూడు సూత్రాలూ చెవిన వేసుకుని, పేద విద్యార్థి ఇంటికి బయలుదేరాడు. దారిలో అతనికి వేదవతీనగరం చూడాలని కోరిక పుట్టింది. అందుచేత అతను ఇంటి దారి విడిచి పెట్టి, దారి అడిగి తెలుసుకుంటూ వేదవతీనగరం దారి పట్టాడు. ఆ నగరం ఎంత దూరం ఉన్నదీ శిష్యుడికి తెలియదు. అది చాలా దూరం ఉంది. బండి చేసుకుని వెళ్ళ టానికి అతని వద్ద డబ్బు లేదు. అందు చేత పట్టుదలగా కాలి నడకనే ప్రయాణం చేసి పేద విద్యార్థి కొన్ని మాసాలకు వేదవతీ నగరం చేరాడు. గురువుగారు చెప్పిన మొదటి సూత్రం, నడవగా నడవగా అదే వస్తుందన్నది, నిజమయింది.

వేదవతీనగరం చాలా పెద్దది. దారి తప్పి అంతదూరం వచ్చినాక, అక్కడే ఒక చిన్న ఉద్యోగం సంపాదించుకుని కొంత

ఎల్. చంద్రశేఖర్

కాలం ఉంటే తప్ప తాను పడిన శ్రమకు ఫలితం ఉండదని విద్యార్థికి తోచింది. ఆ ప్రకారమే అతను కొద్దిపాటి జీతం మీద ఒక ఉద్యోగం సంపాదించి, తనకు పనిలేని వేళలలో కనిపించిన వారినల్లా నగర విశేషాలు అడుగుతూ వచ్చాడు.

"అడగగా అడగగా అదే తెలుస్తుంది" అన్న రెండో సూత్రం అక్షరాలా నిజమయింది. అనేకమందితో మాట్లాడిన మీదట శిష్యుడికి ఆ నగరం గురించి అతి ముఖ్యమైన విశేషం తెలిసి వచ్చింది. ఆ విశేషం ఏమిటంటే—

ఆ నగరాన్ని ఏలుతున్నది రాజుకాదు, రాణి. ఆమెకు అయిదారు వివాహాలు జరిగినా, ఇంకా కన్యగానే ఉన్నది. అది ఎలా జరిగిందంటే ఆమెను పెళ్ళాడిన ప్రతి వాడూ పెళ్ళినాటి రాత్రి వింతగా చని పోయాడు. ఇలా అయిదారుగురు చని పోయాక ఆమెను పెళ్ళాడటానికి ఏ రాజ కుమారుడూ సాహసించ లేదు.

చూసి చూసి, మంత్రులకు ప్రాణం విసిగి, తమ రాణీని ఎవరు పెళ్ళాడితే వారికి రాజ్యాభిషేకం చేస్తామని చాటింపు వేశారు. ఆ చాటింపు విని కూడా ఎవరూ రాణీని పెళ్ళాడటానికి ముందుకు రాలేదు.

పేద శిష్యుడీ మాట విని తన గురువు గారు చెప్పిన మూడో సూత్రం జ్ఞాపకం



తెచ్చుకున్నాడు. మెలకువగా ఉంటే మరణ భయం ఉండదు! గురువుగారి మాటల్లో తనకు గల విశ్వాసం కొద్దీ పేద శిష్యుడు రాణీని పెళ్ళాడ నిశ్చయించుకున్నాడు. అతను రాజభవనానికి వెళ్ళి, మంత్రులతో తాను రాణీని పెళ్ళాడ నిశ్చయించినట్టు చెప్పాడు. వాళ్ళు పరమానందభరితులై, పెళ్ళి ముహూర్తం నిశ్చయించారు.

పెళ్ళినాడు పేద శిష్యుడికి రాజోచితమైన దుస్తులు కట్టబెట్టి పెళ్ళి తంతు జరిపించారు. ఆ రాత్రి అతను పడక గదికి వెళుతూనే తన దుస్తులు విప్పి ఒక పక్కన పెట్టి, తన కత్తి కూడా గోడకు చేరబెట్టి, పడక గది వెలపల అలంకారార్థం ఉంచిన అరటి బోదెలలో ఒకటి తలగొట్టి తెచ్చి తాను పడుకునే పక్క మీద ఉంచి, దానిపై దుప్పటి కప్పాడు. తరవాత అతను కత్తిదూసి చేత బట్టుకుని ఒక స్తంభం చాటున నక్కాడు. మరణ భయం గల వాడికి మెలకువ అవసరం గనక అతను నిద్రపోదలచలేదు.

కొద్దిసేపు గడిచింది. పై కప్పులో నుంచి ఒక తాచు పాము పెళ్ళికొడుకు మంచాన్ని ఆని ఉన్న స్తంభం మీదుగా దిగి వచ్చి, పక్క మీద ఉన్న అరటి బోదెను చూసి మనిషే అనుకుని దాన్ని కాటు వేసింది. అదే క్షణంలో శిష్యుడు ముందుకు వచ్చి ఆ పామును కత్తితో నరికేశాడు. ఆ తరవాత అతను చచ్చిన పామునూ, అరటి బోదెనూ అవతల పారేసి నిశ్చింతగా నిద్రపోయాడు.

మర్నాడు మంత్రులు వచ్చి పెళ్ళికొడుకు ప్రాణాలతో ఉండటం చూసి అంతులేని ఆనందం పొందారు. ఆ రోజే వారు అతనికి రాజ్యాభిషేకం జరిపారు. చదువు అబ్బక పోయినా, గురువుగారి మాటలయందు భక్తి శ్రద్ధ లుంచిన వాడు కావటంచేత పేద విద్యార్థి వేదవతీనగరానికి రాజై, చాలాకాలం సుఖంగా రాజ్యపాలన చేశాడు.






# గాడిదల బేరం

చీనాలో ఒక వర్తకు డుండేవాడు. అతని పేరు చావో. అతను ఎప్పుడూ దేశ సంచారం చేస్తూనే ఉండేవాడు. ఎక్కడెక్కడ పూట కూటి బసలుండేదీ అతనికి బాగా తెలుసు. కాని ఒకసారి అతను తూర్పు రాజధానికి ప్రయాణమైపోతూ తాను ఎరగని ప్రాంతంలో ప్రయాణించటం తటస్థించింది. చీకటి పడ బోతూండటం గమనించి అతను పొలాలలో పని చేసుకుంటున్న వారిని, ఈ ప్రాంతాల పూట కూటి ఇల్లుందా అని అడిగాడు.

"ఆ కనిపించే గుట్ట దాటితే ఒక బస ఉన్నది. అక్కడ గాడిదలు కూడా అమ్మ తారు," అని రైతులు చెప్పారు.

చావో గుట్ట దాటి ప్రయాణీకుల బస చేరుకున్నాడు. ఇల్లు చాలా అందంగా ఉన్నది. చావో ఇంటి బయట గాడిదను దిగి లోపలికి వెళ్ళాడు. ఇంటావిడ ఆరేడుగురు ప్రయాణీకులకు సారా అందిస్తున్నది.

ఆమెకు ముప్పై ఏళ్ళు మించి ఉండవు, వితంతువు, మాన మర్యాదలు గల మనిషిగా కనబడింది. ఆమె చావోను చూసి, "మీ సవారీ గాడిదనూ, సామాన్ల గాడిదనూ దయచేసి ఇంటి వెనక కట్టెయ్యండి. నాకు నౌకర్లెవరూ లేరు," అన్నది.

"నౌకర్లు లేకపోతే జీతాలూ ఉండవు. డబ్బు మిగలక ఏం చేస్తుంది?" అని తనలో అనుకుంటూ చావో తన గాడిదలను ఇంటి వెనక కట్టేసి, లోపలికి వచ్చి, మిగతా అతిథులతోబాటు బల్ల ముందు కూచున్నాడు. సరిగా అదే సమయానికి భోజనం వడ్డన ఆరంభమయింది. భోజనం చాలా బాగున్నది. భోజనాలు ముగిసినాక అతిథులు సారా తాగుతూ, కబుర్లాడుకుంటూ అక్కడే కొంత సేపు కాలక్షేపం చేశారు. చావోకు తాగే అలవాటు లేనందున అతను మిఠాయి తింటూ మిగిలినవారితో కబుర్లాడాడు.

చీనా జానపద కథ



త్వరలోనే నిద్రకు వేళ అయింది. దీపాలు ఆర్పేసినాక, తాగిన కైపులో ఉన్న అతిథులు తూలుతూ వెళ్ళి తమ పక్కల మీద పడి, క్షణంలో గుర్రు పెట్టి నిద్ర పోసాగారు. చావో పక్క ఒక తడిక నాను కుని ఉన్నది. ఆ తడిక అవతల ఇంటావిడ పడుకుంటుంది.

చావోకు చాలా సేపు నిద్రపట్ట లేదు. చివర కతనికి కలత నిద్ర పట్టుతూ ఉండగా పెద్ద చప్పుడై మెలకువ వచ్చింది. ఏదో బరువైన వస్తువు నేల మీద ఈడ్చగా అయే ధ్వని ఒకటి బస యజమానురాలు పడుకునే దిక్కు నుంచి వచ్చింది. ఎవరో దొంగలు అవిణ్ణి చంపేస్తున్నారేమోనని మొదట చావో భయపడ్డాడు. అతను చడీ చప్పుడూ కాకుండా తన పక్క మీద లేచి కూచుని తడికె కేసి చూస్తే అందులో చిన్న కంత కనబడింది. దాని గుండా అతను చూసే సరికి వితంతువు కనిపించింది. ఆమె ఒంటరిగానే ఉన్నది, ఆమె కే ప్రమాదమూ కలగ లేదు.

ఒక బరువైన పెట్టెను ఆమె గది మధ్యకు లాగటంచేత చప్పుడయింది. ఆమె ఆ పెట్టె తెరిచి, దాని ముందు మోకరించి, అందులో నుంచి జానెడు ప్రమాణం గల మనిషి బొమ్మను తీసి మట్టి నేలపై పెట్టింది. తరవాత ఆమె పెట్టెలో నుంచి ఒక కొయ్య ఎద్దునూ, కొయ్య నాగలినీ తీసింది.

విధవరాలు ఎద్దు వెనక నాగలి అమర్చి, దాని వెనక మనిషి బొమ్మను పెట్టింది. ఆమె వాటి మీద నీరు చల్లే సరికల్లా ఆ బొమ్మలు కదలటం చూసి చావో నిర్ఘాంత పోయాడు. అతను చూస్తూండగానే ఆ బొమ్మలు గది అంతా చక్కగా దున్నే శాయి. విధవరాలు చిన్న బుట్టలో గింజ లుంచి మనిషి బొమ్మ చేతి కిచ్చింది. ఆ బొమ్మ ఆ గింజలను దున్నినంత మేరా చల్లింది. గింజలు నేలను తాకీ తాకకముందే

మొలకలెత్తి, పెరిగి కంకులు కూడా వేశాయి. విధవరాలు కంకులు కోసి, గది మూల కూచుని వాటిని నలిచి, చెరిగి, విసిరి పిండి తయారు చేసింది. ఈ పిండితో ఆమె రొట్టెలు చేసి, పొయిలో కాల్చింది. తన పని పూర్తి కాగానే ఆమె నిద్రపోయింది. చావో కూడా నిద్రపోయాడు.

మర్నాడు ఉదయం అతిథులు నిద్ర లేచి, స్నానాలు చేసి, భోజనానికి కూచున్నారు. ఆమె వారికి రొట్టెలు తెచ్చి వడ్డించింది. చావో తన రొట్టెను తినదలచక, చొక్కా చేతిలో దాచుకుని బయటికి వెళ్ళి పోయాడు. ఆయన తన గాడిదలను విప్పి ప్రయాణం కాబోతూ కిటికీ గుండా బసలోకి తొంగి చూశాడు. అతను చూస్తూండగానే మిగిలిన అతిథులు బెంచీల మీది నుంచి కిందికి దొర్లి గాడిదలుగా మారి, అంతా ఒకే సారిగా, ఇల్లంతా మారు మోగేటట్టు ఓండ్ర పెట్టసాగారు. అంతలోనే విధవరాలు ఒక కర్రతో వచ్చి, గాడిదల నన్నిటినీ ఇంటి వెనక్కు తోలుకుపోయి అక్కడ వాటిని కట్టేసింది.

చావో తన గాడిదలను అదిలించు కుంటూ సాధ్యమైనంత వేగంగా ఆ చోటు వదిలి ముందుకు సాగిపోయాడు.




చావో తూర్పు రాజధాని చేరి అక్కడ ఎవరితోనూ తాను చూసిన వింత గురించి చెప్పలేదు. అతను తన పని పూర్తి చేసేసు కుని తిరుగు ప్రయాణపు ఏర్పాట్లు చేసు కున్నాడు. ఈ ఏర్పాట్లతో బాటు అతను కొన్ని రొట్టెలు, విధవరాలు తయారు చేసిన వాటిలాటివే, కొని, తాను తినకుండా దాచిన రొట్టెను వాటితో చేర్చి పెట్టాడు.

తిరుగు ప్రయాణంలో అతను అదే బసలో దిగాడు. ఈసారి అక్కడ అతిథు లెవరూ లేరు. విధవరాలు అతనికి చాలా మర్యాద చేసి, భోజనం పెట్టింది. తరవాత ఎవరిదారిన వారు వెళ్ళి పడుకున్నారు.



45

చావో ఊహించినట్టే ఒక రాత్రివేళ విధవరాలు పెట్టెను బరబరా ఈడ్చిన చప్పుడయింది. చావో నవ్వుకుని నిద్రకు పడ్డాడు. మర్నాడు తెల్లవారి విధవరాలు అతనికి టీతోబాటు రొట్టెలు తెచ్చి ఇచ్చింది. అయితే అంతకుముందే చావో తాను తెచ్చిన రొట్టెలు తీసి బల్ల మీద పెట్టి ఉంచాడు. అతను ఆమెతో, "ఈ రొట్టెలు తూర్పు రాజధానిలో కొన్నాను. చాలా శ్రేష్ఠమైనవి. మచ్చుకు ఒకటి తిని చూడండి," అంటూ ఆమెకు ఆమె రొట్టె అందించాడు.

ఆమెకు సందేహం కలగలేదు. ఆ రొట్టె తాను తయారు చేసినదే నని గుర్తించక దాన్ని తినసాగింది. ఆమె మూడు నాలుగు ముక్కలు కొరికి తిన్నదో లేదో, బెంచీ మీది నుంచి కింద పడి గాడిదగా మారిపోయింది.

తన యుక్తి పారినందుకు చావో సంతోషించి, ఆ గాడిదను కొట్టి నిలబెట్టి, అది బలంగా ఉండటం గమనించాడు. తరవాత అతను విధవరాలి పెట్టె నుంచి బొమ్మలు తీసి, నేలపై ఆమె ఉంచినట్టే ఉంచి, నీరు చల్లాడు. కాని అవి కదలలేదు. వాటిని ఉండనివ్వటం క్షేమం కాదనుకుని, తగల బెట్టేసి, చావో కొత్త గాడిదను ఎక్కి వెళ్ళిపోయాడు.

ఆ గాడిద అతన్ని నాలుగేళ్ళు మోసింది. ఒకసారి చావో దాని మీద చంగన్ నగరం వీధి వెంట వెళుతూండగా, ఒక వృద్ధుడు ఎదురుగా వచ్చి గాడిద కేసి పరిశీలనగా చూసి, "ఓహెూ, పూటకూళ్ళావిడవా? ఎంత మారిపోయావూ!" అన్నాడు.

తరవాత ఆయన చావోతో, "ఈవిడకి మంచి శాస్తి చేశావు! నాలుగేళ్ళు శిక్ష అనుభవించింది. ఇంతటితో ఇక వదిలిపెట్టు!" అన్నాడు. ఆయన మాట పాటించి చావో గాడిద పై నుంచి దిగాడు. వెంటనే అది ఎటో పారిపోయింది. తరవాత అది ఏమయినదీ చావో ఎరగడు.



# తెల్లవాళ్ల స్వర్గం

అమెరికాలో బానిసత్వం ఉండిన కాలంలో జిమ్‌టర్నర్ అనే యజమాని వద్ద ఐక్ అనే బానిస ఉండేవాడు. యజమాని జిమ్‌కు తన కలలను గురించి చెప్పటమూ, తన బానిసకు వచ్చే కలలను గురించి చెప్పించుకోవటమూ చాలా ఇష్టం.

ఒక రోజు ఐక్ తన యజమాని గది తుడవటానికి వచ్చేసరికి అప్పుడే నిద్ర మేలుకున్న జిమ్ అతనితో, "ఐక్, నాకు చాలా చిత్రమైన కల వచ్చింది సుమా," అన్నాడు.

"ఏం కల వచ్చింది, దొరా?" అని ఐక్ అడిగాడు.

"కలలో మీ నీగ్రోల స్వర్గం కనిపించింది. ఎక్కడ చూసినా పెంట పోగులూ, పడిపోయిన ఇళ్ళూ, కూలిపోయిన కంచెలూ, రొచ్చుతో నిండిన రోడ్లూ, చింకి బట్టలతో తిరిగే నీగ్రో పిల్లలూనూ!" అన్నాడు జిమ్.

"నాకు కల వచ్చినప్పుడే మీకూ కల వచ్చి ఉండాలి, దొరా. నేను కలలో తెల్లవాళ్ళ స్వర్గానికి వెళ్ళాను. అక్కడ వీధులన్నీ బంగారమూ, వెండీ పరిచి ఉన్నాయి. ఎక్కడ చూసినా పాలూ, తేనే! ఎంతో అందంగా ఉంది—కాని ఎంతసేపు తిరిగినా నా కక్కడ ఒక్క పురుగు కూడా కనిపించ లేదు!" అన్నాడు ఐక్.






# ముగ్గురు మూర్ఖులు

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నిన్ను చూస్తే జాలి వేస్తున్నది. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఒక చిన్న కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

మహేంద్రారణ్యంలో అనేక ఆటవిక గ్రామాలుండేవి. ఒక గ్రామంలో కల్బటుడనే ఒక యువకుడుండే వాడు. వాడికి తల్లి దండ్రులూ, అన్న దమ్ములూ లేరు. వాడికి గల ఆస్తి అంతా నూరు ఆవులు. వాడు ఆ ఆవుల పాలు అమ్మి సుఖంగానే జీవిస్తూ ఉండేవాడు.

కల్బటుడికి యుక్తవయసు వచ్చింది. తగిన పిల్ల దొరికితే పెళ్ళాడాలని నిశ్చయించి వాకబు చేశాడు. అయిదారు కోసుల దూరాన

బేతాళ కథలు

మరొక గ్రామంలో ఒక యోగ్యురాలైన కన్య ఉన్నట్టు తెలిసింది. ఆ పిల్ల తండ్రికి అరు వేల అవు లుండేవి. ఆయనకు ఒక్కతే కుమార్తె.

కల్బటుడి తరఫున మధ్యవర్తి వెళ్ళి ఆయనతో పెళ్ళి మాటలు మాట్లాడాడు. "కనీసం నూరు అవులైనా ఓలి ఇస్తేనేగాని పిల్ల నివ్వను," అన్నాడు కన్య తండ్రి.

మధ్యవర్తి వచ్చి ఈ మాట చెప్పగానే కల్బటుడు కొంచెం సేపు ఆలోచించి, భార్య కోసం తనకు గల నూరు ఆవులనూ ఓలిగా ఇవ్వటానికి ఒప్పుకున్నాడు.

ఈ విధంగా కల్బటుడికి భార్యతోబాటు దారిద్ర్యం కూడా సంప్రాప్తమయింది. అయినా వాడు ఎంత మాత్రమూ చింతించక, తన భార్యతో, "నాకున్న అవు లన్నీ నీ కోసం ఇచ్చేశాను. నే నిప్పుడు కటిక దరిద్రుణ్ణి. అయినప్పటికీ, ఊళ్ళో వాళ్ళ ఆవులకు పాలు తీసి మనిద్దరి పోషణా చూస్తాను," అన్నాడు.

"అలాగే కానీ!" అన్నది భార్య.

కల్బటుడు ఊళ్ళో వాళ్ళ ఆవులను కాస్తూ, ఆ సంపాదనతో తన పొట్టా, తన భార్య పొట్టా నింపసాగాడు. ఇలా కొంత కాలం గడిచింది.



ఒకనాడు కల్బటుడి భార్య తమ ఇంటి ముందు నిలబడి ఉండగా పర్ణకు డనే ఒక యువకుడు ఆమెను చూసి మోహించాడు. ఆమె చేత ఎలాగైనా కల్బటుడికి విడాకు లిప్పించి, మారు మనువుగా తనను చేసు కునేటట్టు చేయాలని వాడికి బుద్ధి పుట్టింది. వాడు ఒక ముసలిదాన్ని మధ్యవర్తిగా పంపాడు. ఆ ముసలిది కల్బటుడు లేని సమయంలో వాడి భార్యకు పర్ణకుడి సలహా చెప్పింది. కల్బటుడి భార్య ముసలిదానితో, "అంతా విన్నాను. కాని నేను ఏ నిశ్చయ మైనా చేసుకోవటానికి వ్యవధి కావాలి. ఆలోచించి చెబుతాను," అన్నది.



మూడు నెలలు గడిచాయి. కల్పటుడి మామగారికి తన కుమార్తెను చూడాలని బుద్ధి పుట్టింది. ఆయన అల్లుడి గ్రామానికి బయలుదేరి వచ్చాడు.

కల్పటుడి భార్య తన తండ్రికి నీళ్ళిచ్చి చావడిలో కూచో బెట్టింది. ఎలా ఉన్నావని తండ్రి అడిగితే బాగానే ఉన్నానని చెప్పి ఆమె వంట ఇంట్లోకి వెళ్ళింది. తండ్రికి వంట చేసి పెడదామంటే వంటిల్లు శూన్యంగా ఉంది. ఆమె గుడ్ల నీళ్ళు కుక్కుకుంటూ అటు నుంచే దొడ్లోకి వెళ్ళి, దొడ్డి వాకిలి కుండా బయటికి వెళ్ళింది. అక్కడ పర్ణకుడు కనిపించి ఆమెను తన దగ్గిరికి రమ్మని పిలిచాడు. ఆమె దగ్గిరికి వచ్చినాక వాడు, "నీ దగ్గిరికి ముసలిదాన్ని పంపిస్తే ఆలోచించి చెబుతానన్నావు. నాకు క్షణ మొక యుగంగా ఉంది. ఆ రోజు నిన్ను మీ ఇంటి ముందు చూసినది మొదలు నాకు తిండి లేదు, కునుకు లేదు. చివరకు కలలో కూడా నీవే కనిపిస్తున్నావు! నన్నెందు కీ విధంగా వేధిస్తున్నావు?" అని అడిగాడు.

కల్పటుడి భార్య, "నేను నిన్నింక వేధించను. నీతోనే వచ్చేస్తాను. కాని ముందుగా నాకు శేరు మాంసం కావాలి. మా నాన్న చూడ వచ్చాడు. ఆయనకు వంట చేసి పెట్టాలి," అన్నది.

"ఇక్కడే ఉండు. ఇప్పుడే మాంసం తెచ్చి ఇస్తాను," అంటూ పర్ణకుడు వెళ్ళి ఇంత మాంసం తెచ్చి ఆమెకు ఇచ్చి, "ఇంక వాయిదా వెయ్యక నా వెంట వచ్చెయ్యి," అన్నాడు.

"వాయిదా వెయ్యను," అంటూ ఆమె లోపలికి వెళ్ళింది. పర్ణకుడు ఆమె కోసం దొడ్డివాకిలి బయట పచార్లు చేయసాగాడు.

కల్పటుడి భార్య వంటింట్లోకి వెళ్ళి మాంసం తరిగి పొయి మీద పెట్టింది. ఇంతలో కల్పటు డింటికి తిరిగి వచ్చాడు.

చావడిలో కూచుని ఉన్న మామను చూడగానే వాడికి ఒళ్ళంతా జెర్రులు పాకినట్టయింది. వాడు మామతో మామూలు కుశల ప్రశ్నలు చేసి వంటింట్లోకి వచ్చి భార్యను, "ఏమిటి వండుతున్నావు?" అని అడిగాడు.

"మాంసం. పొరుగు వాళ్ళిచ్చారు," అన్నది భార్య.

"మనిద్దరికే జరగకుండా ఉంటే మూడో మనిషికి కూడా ఎట్లా జరిపేటట్టు?" అన్నాడు కల్పటుడు.

"నాకు తెలీదు," అన్నది భార్య. కల్పటుడు బయలుదేరి తాను పనిచేసే ధనికుల ఇళ్ళకు వెళ్ళి, తన మామగారు వచ్చాడని చెప్పి వారి వద్ద కొంచెం మాంసమూ, పాలూ తీసుకుని ఇంటికి తిరిగి వచ్చాడు.

దొడ్డివాకిలి దగ్గిర చాలా సేపు తారట్లాడి పర్ణకుడు, తన ప్రియురాలు ఎంతకూ రాక పోవటం గమనించి, ఆమె ఏమి చేస్తున్నదో చూద్దామని చుట్టు తిరిగి ఇంటి ముందుకు వచ్చి, తల వాకిలి గుండా లోపలికి తొంగి చూశాడు. చావడిలో మామగారితో పాటు కూచుని ఉన్న కల్పటుడు వాణ్ణి చూసి, "రా, లోపలికి రా!" అని ఆహ్వానించాడు. వాడు వచ్చిన పని ఏమిటో కల్పటుడికిగాని, వాడి మామకుగాని తెలియదు.



ముగ్గురూ చావట్లో కూచుని మాట్లాడుతూ ఉండగా, కల్బటుడి భార్య వంట పూర్తి చేసి, తాను వండిన మాంసాన్ని ఒక పళ్ళెంలో పెట్టి చావట్లోకి తీసుకు వచ్చి, వాళ్ళ ముందు పెడుతూ, "ముగ్గురు మూఢులూ ఆరగించండి!" అన్నది.

"ఎవరు మూఢులు?" అని తండ్రి ఆమెను అడిగాడు.

"ముందు నీవు మూఢుడవు. నీ కన్న మూఢుడు నా భర్త. అతడి కన్న గొప్ప మూఢుడు నన్ను మారు మనువు చేసుకో గోరే ఈ పర్ణకుడు," అన్నది కల్బటుడి భార్య తండ్రితో.

కల్బటుడి మామగారు జరిగిన సంగతి అంతా తెలుసుకుని ఇంటికి వెళుతూనే తన మందలో సగం ఆవులను అల్లు డింటికి తోలించాడు. ఆ తరవాత కల్బటుడూ, వాడి భార్యా దారిద్ర్య బాధ లేకుండా సుఖంగా జీవించారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, కల్బటుడి భార్య తన తండ్రినీ, తన భర్తనూ, తన ప్రియుణ్ణీ మూఢులని ఎందు కన్నది? తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఆరు వేల ఆవుల ఆస్తి కలిగి తన కున్న ఒక్క కుమార్తెనూ నూరు ఆవులకు అమ్మిన వాడు మూఢుడు కాక మరేమవుతాడు? పెళ్ళాడే వాడు తన ఆస్తి పెంచుకుంటాడు గాని ఉన్న ఆస్తిని సొంతం పోగొట్టుకోడు. అలాటి పనిచేశాడు గనక కల్బటుడు మరింత పెద్ద మూఢుడు. కల్బటుడు నూరు ఆవుల నిచ్చి కొనుక్కున్న దాన్ని శేరు మాంసంతో కొనటానికి యత్నించిన పర్ణకుడు అందరి కన్నా పెద్ద మూఢుడు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# చందమామ మందహాసం

అనేక శతాబ్దాల క్రితం షారిమాన్ అనే పర్షియా చక్రవర్తి ఉండేవాడు. ఆయన ఖురాసాన్‌లో ఉండేవాడు. ఆయనకు నూరు గురు భార్య లుండినప్పటికీ ఒక్కరికీ ఒక్క నలుసు కూడా పుట్టలేదు.

తనకు సంతానం లేదన్న చింత మరిచి పోవటాని కాయన ఒకనాడు పేరోలగంలో విద్వద్గోష్ఠిలో మునిగి ఉండగా, ద్వార పాలకు డొకడు వచ్చి, రాజుగారి దర్శనం నిమిత్తం ఎవరో వర్తకుడు ఒక బానిస పిల్లను తన వెంట తీసుకొచ్చి, బయట వేచి ఉన్నాడని విన్నవించాడు.

వారిని లోపలికి తీసుకు రమ్మని రాజు ఆజ్ఞాపించాడు. వర్తకుడు బానిసపిల్లను లోపలికి తీసుకువచ్చి, ఆమె ముఖాన కప్పి ఉన్న మేలి ముసుగు తొలగించే సరికి, రాజూ, మిగిలిన సభికులూ ఆశ్చర్యంతో నిశ్చేష్టులయారు. ఎందుకంటే ఆమె సౌందర్యం మానవాతీతంగా ఉన్నది, ఆమెలో మహారాజుల కుండదగిన ఠీవి ప్రస్ఫుటమవుతున్నది.

రాజు వర్తకుణ్ణి, "ఈమె వెల ఎంత?" అని అడిగాడు.

"మహారాజా, ఈమెను నేను మరొకరి నుంచి రెండు వేల దీనారాలకు కొన్నాను. తరవాత మూడు సంవత్సరాలు ప్రయాణం చేసి నే నీమెను ఇక్కడికి తెచ్చాను. అందుకుగాను మరి మూడు వేల దీనారాలు ఖర్చయాయి. అయితే నే నీమెను తమకు కానుకగా అర్పించటానికి తెచ్చాను గాని, విక్రయించటానికి తీసుకురాలేదు," అని వర్తకుడు జవాబు చెప్పాడు.

ఈ మాటలకు రాజు సంతోషించి, వర్తకుడికి దుశ్శాలువలు కప్పి, పది వేల దీనా రాలు పారితోషికంగా ఇప్పించాడు. వర్తకుడు రాజుగారి ఘనతనూ, ఔదార్యాన్నీ

సి. మాధవరావు



ఎంతగానో కొనియాడి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

రాజు అంతఃపుర దాసీలకు బానిసను అప్పగిస్తూ, "ఈమెను చక్కగా స్నానం చేయించి, ప్రయాణపు బడలిక తీరేలాగ శరీరానికి సుగంధపు పూతలు పూయండి. ఈమెకు సముద్రతీరాన గల భవనంలో బస ఏర్పాటు చేయండి," అని చెప్పాడు.

షారిమాన్ నివసించే "శ్వేతపురం" సముద్రతీరాన ఉండేది. అందుచేత సముద్రాన్ని అనుకుని ఉన్న భవనంలో కొత్త బానిసకు బస ఏర్పాటు చెయ్యటం దాసీలకు సాధ్యమయింది.

ఆమె విశ్రాంతి తీసుకోవటానికి వ్యవధి ఇచ్చి రాజు ఆమె ఉండే బసకు వెళ్ళాడు. ఆయన రావటం చూసి కూడా ఆమె లేచి నిలబడలేదు, ఆయన పట్ల లక్ష్యం ఏమీ చూపలేదు. రాజు ఆశ్చర్యపడి, "ఈమెను పెంచినవారు కొత్తిగా నాగరికత లేనివారై ఉంటారు," అనుకున్నాడు. అయితే ఆమె అందం కళ్ళారా చూస్తుంటే రాజుకు ఆమె అవినయాన్ని క్షమించ బుద్ధి పుట్టింది. ఆయన ఆమె సరసనే కూచుని, మంచిగా పలకరించాడు. కాని ఆమె ఒక్క మాటకూ జవాబు చెప్పలేదు. ఆయన మాటలు విన్నట్టుగా కూడా కనిపించలేదు.

ఇందుకు కూడా రాజు కోపం తెచ్చుకో లేకపోయాడు. ఆమె చక్కదనం ఆయనను పూర్తిగా జయించింది. "ఒకవేళ మూగ దేమో!" అనుకుని ఆయన పరిచారికలతో రహస్యంగా, "ఈమె నోట మాటరాగా మీరే మైనా విన్నారా?" అని అడిగాడు.

"మేము ఆమెను స్నానం చేయించి, తల దువ్వి, దుస్తులు తొడుగుతున్నంతసేపూ ఇష్టంగాగాని, అయిష్టంగాగాని నోరు విప్పి ఒక్క ముక్క అనలేదు. ఆమెకు మా మీద కోపమో, లేక మన భాష ఆమెకు తెలియదో చెప్పలేం," అన్నారు దాసీలు.

రాజుగారి ఆశ్చర్యం మరింత అయింది. ఆయనకు ఒక అనుమానం కలిగింది; ఈ బానిసపిల్ల మాట్లాడక పోవటానికి ఏదో ఒక గొప్ప విచారం కారణమయి ఉంటుం దనుకుని ఆయన ఆమెకు వినోదం కలిగించ టానికిగాను ఆమె వద్దకు ఆటగాళ్ళనూ, పాట గాళ్ళనూ పంపాడు. నృత్యగానాలకు అందరూ హర్షించారు గాని ఆమె మటుకు తల వంచుకుని కూచుని, చిన్న చిరు నవ్వయినా నవ్వలేదు.

ఇన్నివిధాల ఆశాభంగం పొందికూడా రాజు తన బానిసను పెళ్ళాడి, ఆమె మీది ప్రేమకొద్దీ, రాజ్యవ్యవహారాలన్నీ వదిలేసి, ఆమె బసలోనే కాలం గడపసాగాడు. ఆమె నోరు విప్పి ఒక్క మాటైనా మాట్లాడలేదన్న విచారం తప్పిస్తే, రాజుకు ఆమెతో కాపరం అన్నివిధాలా ఆనందదాయకంగానే ఉన్నది.

అప్పుడప్పుడూ ఆయన ఆమెతో, "నాకు నీ పైన ఎంత ప్రేమ ఉన్నదో చూస్తున్నావు గదా! నీ కోసం అందరు భార్యలనూ, రాజ్యాన్నీకూడా తోసిపుచ్చి, నీ దాసుడిలాగా నీ దగ్గిరే పడిఉన్నాను. నా పైన కనికరించి ఎందుకు మాట్లాడవు? నా వల్ల నీ కేమైనా అపచారం జరిగిందా? నీకేమైనా కావాలా? నాతో చెప్పు, ఎంత కష్టసాధ్యమైనా నీ కోరిక




తీర్చుతాను," అంటూ, బతిమాలేవాడు. "నీవు మూగదానివైతే కనీసం సంజ్ఞలతో నైనా మాట్లాడు, అర్థం చేసుకుంటాను," అనేవాడు.

ఒకసారి ఆయన ఆమెతో, "నాకు నూరుగురు భార్యలున్నప్పటికీ సంతానం లేదు. నాకు వయసుమళ్ళుతున్నది. నీ కడుపున అయినా ఒక నలుసు పుడితే నేను నిశ్చింతగా ప్రాణాలు విడుస్తాను. అలాటి సూచనలేమైనా కనబడితే చెప్పు, నిన్ను వేడుకుంటున్నాను," అన్నాడు.

రాజు ఈమాట అనగానే ఆ బానిసపిల్ల మొట్టమొదటిసారిగా తల ఎత్తి రాజు కళ్ళ

లోకి చూసి, చిరునవ్వు నవ్వింది. ఆమె ముఖాన చిరునవ్వు కనిపించగానే రాజుకు భవనమంతా ఒక్కసారిగా ప్రకాశించి నట్టుగా తోచి, అపారమైన ఆనందం కలిగింది.

ఆమె నోరు తెరిచి రాజుతో మాట్లాడింది. "మహారాజా, మీ కోరిక సిద్ధించింది. నే నిప్పుడు గర్భవతిని," అన్నదామె.

రాజు పొందిన ఆనందానికి మేరలేదు. ఆయన ఆవేశంతో, "దేవుడెంత దయా మయుడు! నా కున్న రెండు కోరికలనూ ఒకేసారి తీర్చాడు; నీవు మాట్లాడావు, నేను తండ్రిని కాబోతున్నాను!" అన్నాడు.

ఆయన లేచి, ఇప్పుడే వస్తానని బానిసతో చెప్పి, తిన్నగా రాజసభకు వెళ్ళి, సింహా సనం మీద కూచుని, తన మంత్రులతో, తాను తండ్రి కాబోతున్నట్లు చాటింపు వేయించమనీ, పేదలకూ, వితంతువులకూ, అక్కర గలిగినవారికీ లక్ష దీనారాలు పంచి పెట్టమనీ చెప్పాడు. ఈ పనులన్నీ యథా ప్రకారం జరిగాయి.

రాజు సభ నుంచి తన ప్రియురాలి వద్దకు తిరిగి వచ్చి, "నీవు ఏడాదిపాటు నా దగ్గిరా, నా పరివారం దగ్గిరా, నోరు ఎందుకు మెదిపావుకావో, మాట్లాడాలని ఇవాళ ఎందుకు నిశ్చయించుకున్నావో



ఇప్పుడైనా చెబుతావా?" అని బ్రతిమా లుతూ అడిగాడు.

"మహారాజా, నేను ఎక్కడి నుంచో ఇక్కడికి బానిసగా వచ్చాను. నా దేశానికీ, తల్లికీ, అన్నకూ దూరమయాను. బానిస గానే ఇక్కడ చిక్కుకు పోయాను. నా హృదయం క్షోభించింది. అలాటప్పుడు యిక్కడ ఎవరితో మాత్రం నే నెందుకు మాట్లాడాలి?" అన్నదామె.

"నీ బాధ నేను అర్థం చేసుకోగలను. కాని నీ విక్కడ బానిసగా చిక్కిపోయినా ననటం అధర్మం. నిన్ను సమస్తానికి రాణిని చేశాను, నేనే నీకు దాసుణ్ణి అయాను. మీ వాళ్ళకు దూరమైనందుకు బెంగగా ఉంటే నాతో మాట మాత్రం చెప్పి ఉండ వలిసింది. నేను నా ఉద్యోగులను పంపి నీ వారిని క్షణంలో పిలిపించి ఉందును," అన్నాడు రాజు.

ఈ మాటకు ఆమె ఇలా సమాధానం చెప్పింది :

"నా పేరు గుల్నార్. నా జన్మ స్థలం సముద్రం. నా తండ్రి ఒక సముద్రరాజు. ఆయన మరణించిన అనంతరం ఒకనాడు నాకు ఏదో కారణంగా నా తల్లి మీదా, అన్న మీదా చాలా కోపం వచ్చింది. ఇక సముద్రంలో ఉండనే కూడదనీ, భూమి






మీదికి వచ్చి నాకు నచ్చిన మొట్టమొదటి వాడికి భార్య అయిపోవాలనీ నిశ్చయించుకున్నాను. ఒకనాటి రాత్రి నా తల్లీ, నా అన్న సాలిహ్ నిద్రపోతున్న సమయంలో ఇంటి నుంచి బయలుదేరి ఒక దీవి మీదికి వచ్చి, నిండు వెన్నెలలో, నిర్మలంగా నక్షత్రాలతో వెలిగే ఆకాశం కింద పడుకున్నాను. చల్ల గాలి వీస్తూండటం చేత నాకు సుఖమైన నిద్ర పట్టింది. నేనా నిద్రలో ఉన్న సమయంలో ఎవడో వచ్చి నన్ను పట్టుకున్నాడు. నేను వాడితో పెనగులాడాను కాని, వాడి పట్టు విడిపించుకోలేక పోయినాను. వాడు నన్ను తన గుడిసెకు తీసుకువెళ్ళాడు. అక్కడ



నేను నా కున్న శక్తికొద్దీ వాణ్ణి కాళ్ళా చేతులా తన్నాను. నేను తనకు లొంగనని గ్రహించి వాడు నన్ను మర్నాడే బజారుకు తీసుకుపోయి ఒక వర్తకుడికి బానిసగా అమ్మాడు. ఆ వర్తకుడే నన్ను తెచ్చి మీ కిచ్చాడు. ఆయన చాలా పెద్ద మనిషి. నా వయసు చూసి, ఆయన నన్ను తన కొరకు వుంచుకోవటానికి బదులుగా, దూర ప్రయాణం చేసి మీకు కానుకగా అర్పించాడు. నేను మొట్టమొదట ఇక్కడికి వచ్చినప్పుడు నన్నెవరైనా తాకినట్టయితే సముద్రంలోకి దూకి నా తల్లినీ, అన్ననూ చేరుకుందామనుకున్నాను. మీరు నన్ను పెళ్ళాడినప్పుడు ఆ పని చేసి ఉండవలిసిందేగాని మా వాళ్ళ దగ్గిరికి తిరిగి వెళ్ళటానికి అభిమానం అడ్డొచ్చింది. ఆ అభిమానంతోనే నే నెవరితోనూ మాట్లాడలేదు. మీరు నన్ను నిజంగా ప్రేమిస్తున్నట్టు తెలిసినాక నా మనస్సు మారసాగింది. గర్భవతిని కూడా అయాక నాకు మీ మీద అనురాగం మరింత అయింది. తప్పించుకుపోవాలన్న ఆలోచన పూర్తిగా పోయింది. దానికి మరొక కారణం కూడా ఉంది. నేను భూమి మీద నివసించే వాడికి భార్యనైనానంటే నా తల్లీ, అన్నా అవమానంతో కుంగిపోతారు; నా భర్త



పర్షియా సామ్రాజ్యాని కంతకూ చక్రవర్తి అనీ, అంతటి మహారాజు ప్రపంచంలో మరి లేడనీ చెబితే నమ్మరు! అదీ నా కథ."

రాజు గుల్నార్ చెప్పినదంతా విని, "గుల్నార్, నీ కథ అద్భుతం, నీవే అద్భుతం. కాని ఒకటి చెప్పు. నీవు సముద్ర వాసినివని అంటున్నావు గనక నేను నమ్ముతున్నాను. నీ జాతిని గురించి మరి కాస్త వివరంగా చెబుతావా? నీటి అడుగున మనుషులు ఊపిరాడక చావకుండా ఎలా ఉంటారు? ఎలా జీవిస్తారు? ఇది అత్యాశ్చర్యకరమైన విషయమే!" అన్నాడు.

దానికి గుల్నార్ ఇలా సమాధానం చెప్పింది:

"మీరు భూమి మీద ఎలా జీవిస్తారో, మేము నీటి లోపల అలా జీవించగలం. మీరు గాలి పీల్చినట్టు మేము నీటిని పీల్చి ప్రాణాలను పోషించుకుంటాం. అంత కంటె ముఖ్యమైన విషయం ఒకటి మాట్లాడాలి. మా కాన్పులకూ, మీ కాన్పులకూ తేడా ఉన్నది. అందుచేత మీ మంత్రసానులు నాకు సరిగా పురుడు పొయ్యలేక పోవచ్చు. అందుచేత మా అమ్మనూ, అన్ననూ, మా కుటుంబంలోని ఇతరులనూ పిలిపించటానికి అనుమతి ఇవ్వండి. నేను వారితో



రాజీ పడి, వారి సహాయంతో పురుడు పోసుకుంటాను."

రాజు ఆమె చెప్పినదంతా విని, "నీ మాటకు నేనెందుకు ఎదురు చెబుతాను. కాని మీ వారికి సకాలంలో కబురు అందుతుందా? వారు నీ ప్రసవం నాటికి రాగలుగుతారా? ఈ మాట ముందే చెప్పినట్టయితే నేను వారికి ఘనంగా స్వాగత మర్యాదలు ఏర్పాటు చేసి ఉండేవాణ్ణి గద," అన్నాడు.

"మా వాళ్ళకు మర్యాదలతో ఏమీ పని లేదు. అది అలా ఉంచి, వాళ్ళను రప్పించడానికి రోజులూ, వారాలూ అవసరం లేదు; క్షణంలో రప్పించ వచ్చు. మీరు అవతలి

గదిలోకి వెళ్ళి, నన్నూ, సముద్రాన్నీ కూడా జాగ్రత్తగా గమనించండి. ఒక్క క్షణంలో నా కుటుంబంలోని వారి నిక్కడికి రప్పిస్తాను," అన్నది గుల్నార్.

రాజు అవతలి గదిలోకి వెళ్ళి ఒక కిటికీ గుండా తన భార్యనూ, గవాక్షం గుండా సముద్రాన్నీ గమనించసాగాడు. గుల్నార్ రెండు ముసాంబరం తునకలు తీసి బంగారు ధూప పాత్రలో వాటిని అంటించి ధూపం తెప్పించింది. పొగ పైకి లేవగానే ఆమె గట్టిగా ఈలవేసి, ఏవో మంత్రాలు పఠించింది.

వెంటనే సముద్రం పొర్లినట్టయింది. అందులో నుంచి ఒక యువకుడు పైకి వచ్చాడు. అతను అందంగా ఉండటమే గాక, అతనిలో గుల్నార్ పోలికలు కూడా ఉన్నాయి. అతనే రాజకుమారుడు సాలిహ్, గుల్నార్ అన్న. అతని వెనకగా తెల్లని జుట్టుతో ఒక వృద్ధ స్త్రీ పైకి వచ్చింది. ఆమె సముద్రరాజు భార్య, గుల్నార్ తల్లి. ఆమె తరువాత అయిదుగురు ఆడపిల్లలు వచ్చారు. వారు గుల్నార్ దాయాదులు, గొప్ప అందగత్తెలు.

ఆ యువకుడూ, ఆరుగురు స్త్రీలూ నీటి మీదగా నడుచుకుంటూ భవనందాకా వచ్చి, ఒకరి వెనకగా ఒకరు పైకి ఎగిరి గవాక్షాల గుండా లోపలికి దూకారు. వారిని లోపలికి



రానివ్వటానికి గుల్నార్ గవాక్షం నుంచి దూరంగా వచ్చేసింది.

వచ్చిన వారంతా గుల్నార్‌ను ఆలింగనం చేసుకుని, ఆనంద బాష్పాలు రాలుస్తూ, "గుల్నార్! నాలుగేళ్ళపాటు మమ్మల్ని వదిలి పెట్టి ఎలా ఉండగలిగావు? ఇంత కాలంగా నీ వార్త తెలియక మేమెంత బాధ పడ్డాం!" అన్నారు.

"మీతో చెప్పకుండా రావటం పెద్ద పొరపాటు. కాని విధిని ఎవరు తప్పించ గలరు? ఏమైనా తిరిగి అందరమూ కలుసు కున్నాం, అంతే చాలు," అంటూ గుల్నార్ తన వాళ్ళందరినీ తన సరసన కూచో బెట్టుకుని తన కథ యావత్తూ వారికి చెప్పింది. చిట్టచివర కామె, "నే నిప్పుడు ఈ మహారాజుకు భార్యనై గర్భవతిగా ఉన్నాను గనక, నా చేత మీరు కాన్పు చేయిస్తారని మిమ్మల్ని పిలిచాను. నాకు ఇక్కడి మంత్రసానుల పైన ఏమాత్రం నమ్మకం లేదు. వారికి మన సంగతి ఏమీ తెలియదు," అన్నది.

గుల్నార్ తల్లి తన కూతురుతో, "అమ్మా, నీవు భూమి పైన నివసిస్తూండటం చూసి కష్టాలలో ఉన్నావేమో నను కున్నాం. సుఖంగా ఉంటున్నా నన్నావు గనక మాకే




విచారమూ లేదు. సముద్ర రాజకుమారు లలో ఎవరినైనా నీవు పెళ్ళాడి ఉంటే బాగుండేదేమో అని లోపల అనిపిస్తుంది," అన్నది విచారంగా.

"ప్రమాణ పూర్తిగా నేను చాలా సుఖ పడుతున్నాను. నా కోరికలన్నీ తీరాయి. కోరదగిన దంటూ నా కిప్పుడేమీ లేదు," అని గుల్నార్ తల్లికి నమ్మ జెప్పింది.

పక్క గదిలో నుంచి గుల్నార్ మాటలు వింటూ ఉండిన రాజు మనస్సు ఆనంద డోలల్లో ఊగిపోయింది.

గుల్నార్ తన దాసీలను కేక పెట్టి వడ్డన చెయ్యమన్నది. ఆమె స్వయంగా వంట

సాలకు వెళ్ళి భక్ష్యభోజ్యాలూ, పళ్ళూ వెంట బెట్టుకు వచ్చి బల్ల మీద వడ్డన చేయించి, తన వారినందరినీ భోజనం చెయ్యమన్నది.

ఇందుకు వారు సమ్మతించక, "మే మిక్కడికి వచ్చినట్టు మహారాజుకు కబురు చెయ్యి. ఆయన అనుమతి లేకుండా మేము వచ్చినదేకాక, ఆయనకు తెలియకుండా ఆయన ఇంట విందులుకుడవటం చాలా అమర్యాదకరం. మా రాక సంగతే కాక, మే మెవరమో కూడా ఆయనకు తెలియదాయె," అన్నారు.

గుల్నార్ పక్క గదిలోకి వెళ్ళి తన భర్తను తీసుకువచ్చింది. రాజు వారిని మనస్ఫూర్తిగా పలకరించి మర్యాదలు చేశాడు. వారాయనను అభినందించారు. ఈ మర్యాదలన్నీ పూర్తి అయిన మీదట రాజు దగ్గిరే ఉండి అతిథుల చేత భోజనం చేయించాడు.

గుల్నార్‌కు పురుడు వచ్చినదాకా ఆమె బంధువులు అక్కడే విందు వినోదాలలో కాలక్షేపం చేస్తూ ఉండిపోయారు. తన తల్లి దాయాదుల సహాయంతో గుల్నార్ ఒక బొద్దయిన మగపిల్లవాణ్ణి కన్నది. బిడ్డ పుట్టగానే వాణ్ణి మేలివస్త్రాల పొత్తిళ్ళతో సహా తీసుకుపోయి రాజుకు చూపారు. వాణ్ణి చూసి ఆయన పొందిన ఆనందం వర్ణనాతీతం. దేవుడు తనకు చేసిన ఉపకారానికి కృతజ్ఞత ప్రకటించటానికై ఆయన పేదలకూ, వితంతువులకూ, తల్లి దండ్రులు లేని వారికీ అంతులేని కానుకలు పంచిపెట్టాడు. ఖైదీల నందరినీ విడుదల చేశాడు.

వారం రోజులు ఎడతెగని ఉత్సవాలు జరిగిన పిమ్మట గుల్నార్ తన భర్త అనుమతితో కుమారుడికి బద్‌బసీమ్ అని పేరు పెట్టింది. బద్‌బసీమ్ అంటే "చంద్రుడి యొక్క మందహాసం" అని అర్థం.

—(ఇంకా ఉంది)





# కిష్కింధా కాండ

సంపాతి తన తమ్ముడి మరణ వార్త విని కన్నీరు కార్చుతూ, "జటాయువును చంపిన ఆ దుర్మార్గుడు రావణుడి పైన పగ తీర్చుకుందామన్నా నేను ముసలివాణ్ణి, రెక్కలు లేనివాణ్ణి, ఏం చేసేది? వెనక వృత్రాసురుడి వధ జరిగిన రోజుల్లో నేనూ, జటాయువూ పోటీ పడి ఒకరి కన్న ఒకరం వేగంగా ఎగురుతూ ఆకాశంలోకి వెళ్ళాం. మిట్ట మధ్యాహ్నపు ఎండ తీక్షతకు తట్టుకో లేక జటాయువు వివశుడై సోలి పోయాడు. అప్పుడు నేను ప్రేమ కొద్దీ నా రెక్కలు చాచి వాడికి నీడ ఇచ్చాను. దానితో నా రెక్కలు మాడి పోయాయి; నేను ఈ వింధ్య పర్వతం పైన పడ్డాను. తరవాత నాకు నా తమ్ముడి సమాచారమే తెలియలేదు," అన్నాడు.

ఈ మాట విని అంగదుడు, "అయ్యా, నీవు జటాయువు అన్నవైతే ఆ రావణుడు ఎక్కడ ఉంటాడో, ఎంత దూరాన ఉంటాడో చెప్పు," అన్నాడు.

"నాయనా, న్యాయానికి నేను స్వయంగా రామకార్యం చెయ్యవలసిన వాణ్ణేగాని, ముసలివాణ్ణీ, అశక్తుణ్ణీ కావటంచేత వాక్సహాయమైనా చేస్తాను. రావణుడు సీతను తీసుకునిపోయిన మాట నిజమే. అతను లంకలో ఉంటాడు. అది ఇక్కడికి నూరామడల దూరాన సముద్ర మధ్యంలో ఉన్నది. లంకలోనే లంకా నగరం ఉన్నది. దాన్ని విశ్వకర్మ బంగారు ద్వారాలతో, బంగారు అరుగులతో, గొప్ప ప్రాకారాలతో నిర్మించాడు. ఆ లంకలోని రావణుడి అంతః

పురంలో సీత రాక్షస స్త్రీల మధ్య దుఃఖిస్తూ ఉన్నది. గద్ద జాతివాణ్ణి కావటంచేత ఇక్కడి నుండే రావణుణ్ణీ, సీతనూ చూడగలుగు తున్నాను. మీ రక్కడికి వెంటనే వెళ్ళి నట్టయితే సీత తప్పక కనబడుతుంది," అన్నాడు సంపాతి.

అప్పుడు జాంబవంతుడు సంపాతితో, "అయ్యా, సీతను రావణుడు పట్టుకుపోగా చూసింది ఎవరు?" అని అడిగాడు. మిగిలిన వానరులు సంపాతి చెప్పే మాట లను ఆసక్తితో వినటానికి ఎదురు చూశారు.

"ఆ కథ చెబుతాను వినండి. నేను కదలలేని వాణ్ణి కావటంచేత నా కొడుకు సుపార్శ్వుడు రోజూ నియమం తప్పకుండా నాకు ఆహారం తెచ్చి ఇస్తూ ఉంటాడు. అలాటిది వాడు ఒకనాడు వేళమించి, సూర్యాస్తమయం అయినాక రావటమేగాక వట్టి చేతులతో వచ్చాడు. అసలే ఆకలి దహించుకుపోతూ ఉండటంచేత నేను వాణ్ణి బాగా తిట్టాను. నా కోపం పోగొట్టుతూ వాడు జరిగిన సంగతి చెప్పాడు. వాడు నా ఆహారం నిమిత్తం మహేంద్ర పర్వతం వద్ద జంతువులు నడిచే దారికి అడ్డంగా నిలిచి ఉన్నాడట. ఆ సమయంలో నల్లని శరీరం గల వాడొకడు సూర్యోదయంలాగా వెలిగిపోయే ఒక స్త్రీని తీసుకుపోతూ అటుగా



వచ్చాడట. ఆ మగవాణ్ణీ, అడదాన్నీ నాకు ఆహారంగా తీసుకు వద్దామని సుపార్శ్వుడు ఆలోచిస్తుండగా ఆ నల్లటివాడు చాలా మంచి తనంగా దారి విడవమని కోరాడట. మర్యాదగా అడిగాడుగదా అని నా కొడుకు దారి ఇచ్చాడట. ఈ సంగతి తెలిసి అక్కడి మునులు సుపార్శ్వుడితో, 'ఇవాళ నీవు బతికి బయట పడటం నీ అదృష్టం! నిన్ను దారి అడిగినవాడు మరెవరో కాదు, లంకా నగరాన్ని ఏలే రావణుడు. వాడు ఎత్తుకు పోతున్నది రాముడి భార్య అయిన సీత!' అని అన్నారట. ఇదంతా జరగటం మూలాన వాడు నాకు వేళకు ఆహారం తీసుకు రాలేకపోయానని చెప్పాడు," అన్నాడు సంపాతి.

తరవాత సంపాతి తన తమ్ముడికి ఇన్ని నీళ్ళు విడిచి, స్నానం చేసి ఒక చోట కూర్చున్నాడు. వానరులు అతని చుట్టూ చేరి కూచున్నారు. సంపాతి మళ్ళీ వారితో ఇలా అన్నాడు:

"నేను సూర్యుడి వేడికి రెక్కలు కాలి ఇక్కడ పడిపోయానని చెప్పాను కాదూ? ఆరు రోజులపాటు నాకు స్పృహలేదు. ఆ తరవాత, నేను పడినది వింధ్య పర్వతం మీద అని తెలుసుకున్నాను. అప్పుడిక్కడ నిశాకర మహర్షి ఆశ్రమం ఉండేది. ఆయన





గొప్ప తపస్వి. అదివరకు నేనూ, మా జటాయువూ ఆ మహర్షిని ఎరుగుదుము. నేను మెల్లిగా కాళ్ళీడ్చుకుంటూ ఆయన ఆశ్రమానికి వచ్చి ఆయన దర్శనం కోసం ఒక చెట్టు కింద నిలిచాను. కొంత సేపటికి ఆ మహర్షి స్నానం చేసి అటుగా వచ్చాడు. ఆయన తిన్నగా ఆశ్రమంలోకి వెళ్ళి మళ్ళీ వచ్చి నన్ను చూసి నేను వచ్చిన పని అడిగాడు. నా దుస్థితికి కారణం ఏమిటన్నాడు. నన్ను గుర్తించాడు కూడా. నే నాయనతో జరిగినదంతా చెప్పాను. నాకు ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తున్నదని కూడా ఆయనతో అన్నాను. నాకు దుఃఖం ఆగలేదు. ఆయన కొంతసేపు కళ్ళు మూసి ధ్యాన నిమగ్నుడై, 'నీకు మళ్ళీ రెక్కలు వస్తాయి, జవసత్వా లేర్పడతాయి. భవిష్యత్తులో దశరథుడనే రాజు పుట్టబోతాడు. అతని కొడుకు భార్యతో అరణ్యవాసం చేయవస్తాడు. వారు జనస్థానంలో ఉండేటప్పుడు రావణుడనే రాక్షసరాజు రాముడి భార్యను అపహరిస్తాడు. ఆమె కోసం వెతకమని రాముడు పంపగా వానరులు నీ వుండే చోటికి వస్తారు. వారికి నీవు సీత సంగతి చెప్పు. నీవు ఎక్కడికీ పోలేవు గనక ఇక్కడే ఉండటం మంచిది,' అన్నాడు. ఇదంతా ఎనిమిది వేల ఏళ్ళనాటి మాట. నాకీ సంగతి చెప్పిన నిశాకరమహర్షి నూరేళ్ళ అనంతరం దేహం చాలించాడు. నా మనసు అయోమయంలో పడిపోయింది. రావణుడు బలశాలి అయితేనేంగాక, ఆ దుర్మార్గుడు సీతను తీసుకుపోవటం నా కొడుకు కళ్ళారా చూశాడని తెలిసినప్పుడు, 'వాడితో పోరి సీతను విడిపించి ఉండవలిసింది,' అని నా కొడుకును మందలించాను. నా తమ్ముడు ప్రాణాలు విడిచాడు, నా కొడుకు ఏమీ చేయనేలేదు. రావణుడు మహాపరాక్రమవంతుడనటానికి సందేహం లేదు. కాని మీరు తక్కువవాళ్ళు కారు. సుగ్రీవుడు



సరి అయిన వాళ్ళనే ఎంచి పంపాడు. మీరు వెళ్ళినట్టయితే సీత తప్పక కనిపిస్తుంది. తరవాత రామ లక్ష్మణుల బాణాలతో ఆ రావణుడు తప్పక చస్తాడు. వాడు నా తమ్ముడైన జటాయువును చంపినందుకు నా పగకూడా తీరుతుంది.''

ఈ విధంగా సంపాతి వానరులతో చెబుతూండగానే అతనికి కొత్త రెక్కలూ, ఈకలూ మొలుచుకు వచ్చాయి. సంపాతి ఆనందంతో, ''చూశారా, నిశాకరమహర్షి చెప్పినది అక్షరాలా జరిగింది. మీరు వెళ్ళే పని జరుగుతుందని కూడా ఆయన అన్నాడు. అందుచేత మీకు కార్యసిద్ధి తప్పక అవుతుంది,'' అంటూ ఆకాశంలోకి ఎగిరాడు. ఇది చూసి వానరులు కూడా కొత్త ఉత్సాహంతో దక్షిణంగా బయలుదేరారు. సీత జాడ తెలిసిన సంతోషంతో వాళ్ళు గెంతారు, సింహనాదాలు చేశారు. ఈ విధంగా వెళ్ళి వారు దక్షిణ సముద్ర తీరాన్ని చేరుకున్నారు.

అంతులేని ఆ సముద్రాన్ని చూడగానే వానరులకు భయం పుట్టింది. ఆ సముద్రంలో నూరామడల దూరాన లంక ఉన్నది. దీన్ని ఎలా దాటటం? అంగదుడు మేటి వానరులను సమావేశ పరిచి, ''మనం ఎలాగైనా ఈ సముద్రాన్ని దాటనిదే సీతాదేవిని చూడలేము. సీతను చూడకుండా తిరిగిపోయే

కన్న ఇక్కడ ప్రాయోపవేశం చెయ్యటం మేలు. సముద్రాన్ని చూసి భయపడి ప్రయోజనం లేదు. మీలో ఎవరెవరు ఎంతెంత దూరం దూకగలరో చెప్పండి," అన్నాడు. సముద్రం దాటి లంకకు చేరగల ఘటికుడి పైన అందరి క్షేమమూ ఆధారపడి ఉన్నది. గజుడు పది ఆమడల దూరం దూకగల నన్నాడు. గవాక్షుడు ఇరవై ఆమడలూ, గవయుడు ముప్పై ఆమడలూ దూకగల మన్నారు. నలభై ఆమడలు దూక గల నన్నాడు శరభుడు. గంధమాదనుడూ, మైందుడూ, ద్వివిదుడూ వరసగా యాభై, అరవై, డెబ్భై ఆమడలు దూకగల మన్నారు. సుషేణుడు ఎనభై ఆమడలు దూకగల నన్నాడు. జాంబవంతుడు, "ఒకప్పుడు నేను ఎంత దూరమైనా దూకేవాణ్ణి. త్రివిక్రముడు వామనావతార మెత్తి మూడడుగులతో మూడు లోకాలూ ఆక్రమించి నప్పుడు నేను అతని చుట్టూ ప్రదక్షిణం తిరిగి వచ్చాను. ఇప్పుడు ముసలివాణ్ణి, తొంభై యోజనాలు మించి దూకలేను," అన్నాడు.

అందరన్న మాటలూ విని అంగదుడు, "నేను నూరు ఆమడల దూరం సులువుగానే దూక గలను. కాని తిరిగి రాగలనని నిశ్చయంగా చెప్పలేను," అన్నాడు.



ఆ మాట విని జాంబవంతుడు, "నాయనా, మాకు రాజువంటి వాడవు. నీవు మాలో ఒకణ్ణి లంకకు పంపవచ్చు గాని నిన్ను మేమెలా పంపుతాము? అది పొసగదు," అన్నాడు.

"నేనూ వెళ్ళక, మీలో వెళ్ళేవారూ లేక పోతే ఇక మనకు ప్రాయోపవేశమేగదా గతి?" అన్నాడు అంగదుడు.

"నాయనా, ఆ విషయం నీ వేమీ విచారించకు. మన పని సానుకూలం చెయ్య గల మహామహుడు అడుగో దూరాన ఒంటరిగా కూచున్నాడు," అంటూ జాంబవంతుడు హనుమంతుణ్ణి చూపాడు.

అతను హనుమంతుడి వద్దకు వెళ్ళి, "మేమంతా తలలు పగల గొట్టుకుంటూ ఉంటే మా కందరికీ మేటివైన నీవు ఉలుకూ, పలుకూ లేకుండా ఇక్కడ ఒంటిగా కూర్చున్నావేమిటి? పుట్టుతూనే సూర్యుణ్ణి చూసి పండనుకుని ఆకాశాని కెగిరిన వాడవుకదా, నీవు కాక ఈ మహా సముద్రాన్ని మరెవరు దాట గలరు? వేగంలో వాయువుకు సమానమైన వాడవు, గరుత్మంతుడికి తీసిపోనివాడవు. ఎగరటంలో నీకు సరి వచ్చేవాళ్ళు మాలో ఎవరున్నారు? నీ ప్రజ్ఞ చూడటానికి ఈ వానరులంతా ఆత్రంగా ఎదురు చూస్తున్నారు. మరి లే! లేచి నీ శక్తి చూపించు!" అని ఉత్సాహ పరిచాడు.

ఈ మాటలు వింటూంటే హనుమంతుడి శరీరం పొంగిపోయింది. హనుమంతుడి శరీరం పెరిగి పోతున్న కొద్దీ వానరులు ఉత్సాహాతిశయంతో సింహనాదాలు చేశారు. వారి ప్రశంసలు వింటున్న కొద్దీ హనుమంతుడి బలం కూడా పెరగ సాగింది. ఆ ఉత్సాహంలో అతను, "ఔను, ఈ సముద్రాన్ని అవలీలగా దాటుతాను. కావలిస్తే నేను సూర్యుడితో బాటు తూర్పు నుంచి బయలుదేరి పడమరకు వెళ్ళి మధ్యాహ్నని కల్లా సూర్యుడికి ఎదురు రాగలను. శుభ శకునాలు కలుగుతున్నాయి. నేను సీతాదేవిని తప్పక చూసి వస్తాను. మీరేమీ దిగులు పడకండి," అన్నాడు.

తాను భూమిని తన్ని పైకి లేచేటప్పుడు భూమి కంపిస్తుందనే ఉద్దేశంతో హనుమంతుడు సమీపంలో ఉన్న మహేంద్ర పర్వత శిఖరాన్ని ఎక్కాడు. అతను అక్కడ నడుస్తుంటే అతని పాద ఘట్టనకు రాళ్ళు పిండి అయాయి, మహేంద్రగిరిపై ఉండే జంతువులు భయపడి నలు దిక్కులకూ పారిపోయాయి.

[కిష్కింధాకాండ సమాప్తం]



# 23. "ఇంద్రధనుస్సు" జలపాతం

ఆఫ్రికాలోని విక్టోరియా జలపాతాలు నాలుగింటిలో "ఇంద్రధనుస్సు" జలపాతం ఎక్కువ నిడివి గలది. ఈ జలపాతాలు జాంబెసీ నదికి చెందినవి. "ఇంద్రధనుస్సు" జలపాతం ఎత్తు నయాగరాకు రెట్టింపు—దాదాపు 350 అడుగులు. ఇది 100 అడుగుల వెడల్పు గల కనుమలో పడుతుంది.





# ప్రశ్నోత్తరాలు

1. దర్భా శాస్త్రులు, గుణదల

స్వయంప్రభ హనుమంతునితో [సెప్టెంబరు] మయుడు హేమ యను అప్సరసతో సుఖ జీవనము చేయుచుండ దేవేంద్రుడు సహింపలేక వజ్రాయుధమును ప్రయోగించిన తదుపరి బ్రహ్మ ఆ ప్రదేశమును హేమకు యిచ్చినట్లు చెప్పెనని వ్రాసిరి. కంకంటి పాపరాజు ప్రణీతంబైన ఉత్తర రామాయణము ద్వితీయాశ్వాసములో—

**"చందమామ"లో ప్రచురిస్తున్న రామాయణం వాల్మీకి రచించినది, కంకంటి పాపరాజు రచించిన ఉత్తర రామాయణం కాదు.**

2. ఎస్. రుద్రప్ప, షాహాబాద్

భూమి తిరిగినచో ఇండ్ల దిక్కులు ఏల మారవండి?

**సూర్యుణ్ణి బట్టీ, నక్షత్రాలను బట్టీ మన ఇళ్ళ దిక్కులు మారుతూనే ఉన్నాయే. ఉదయం పూట సూర్యుణ్ణి చూసే ఇల్లు సాయంకాలానికి సూర్యుడికి పెడమొహమవుతుంది. కాని మనం భూమి మీద నిర్ణయించుకున్న దిక్కులు భూమి కంతటికీ వర్తించవు. మీ యింటికి తూర్పుగా ఫలాని వేపచెట్టు ఉన్నదనుకుందాం. భూమి తిరిగేటప్పుడు మీ ఇంటితో బాటు అది కూడా తిరుగుతుంది గనక అది ఎప్పుడూ ఆ దిక్కుగానే కనిపిస్తుంది. ఇలాటి దిక్కులు భూమి మీద వేరువేరు ప్రాంతాలకున్నాయిగాని భూమికి లేవు.**

3. ఎస్. వి. భార్గవ, నెల్లూరు

ధృతరాష్ట్రుడు ప్రజల నుద్దేశించి పలుకుతూ, "నా కొడుకులు చేసిన అపరాధాలన్నీ క్షమించమని నేను, కుంతీ వేడుకుంటున్నాం" అని చెప్పాడు—

**కుంతి అన్నమాట రచనలో పొరపాటు, గాంధారి అని ఉండాలి.**

4. పాల్వాయి రఘోత్తమరెడ్డి, కాకెంపల్లి

ఏప్రిల్ సంచికలో నేనడిగిన ప్రశ్నకు భోజుడి ఆస్థానంలో కాళిదాసు అనే కవి ఉన్నట్లు చరిత్ర చెప్పటం లేదని సమాధాన మిచ్చారు. చరిత్ర చెప్పనిదే 1960 మే సంచికలో 53వ పేజీలో భోజుడి ఆస్థానంలో కాళి దాసు అనే కవి ఉన్నట్లు ఎందుకు ప్రచురించారు?

కథలకూ, చరిత్రకూ ఉండే తేడా కూడా తెలియదా? "ఎడమచెయ్యి" అన్నది కాల్పనిక సంఘటన, చరిత్ర కాదు.

5. సలాది కనకారావు బి.ఎస్‌సి., విజయవాడ

రోదసిలో ప్రయాణము చేయు మానవునకు ఆయువు తగ్గదనీ, క్షీణ వృద్ధు లుండవని, ఎన్నాళ్ళు రోదసిలో ఉన్నా మనిషి శరీరంలో మార్పు ఉండ దంటారు. ఇది ఎంతవరకు నిజం?

కాంతి వేగంతో పోల్చదగిన వేగంలో ప్రయాణించే వాడికి కాలం నింపాదిగా జరుగు తుందన్నంత వరకు నిజం. ఇంత వేగాలను ఉత్పత్తి చేసే రాకెట్ ఇంజన్లు ఇంత వరకు సృష్టి కాలేదు. ప్రస్తుతం జరిగే రోదసీయానాలలో ఆయుర్దాయం ఒక్క సెకండు కలిసి వచ్చినదాకా నమ్మకం లేదు.

6. కె. శ్రీనివాసులు నాయుడు, కడప

సముద్రాలలో మొట్టమొదట ఇంత నీరు ఎలా వచ్చింది?

భూమిలో చేరిన పదార్థంలో నీటి ఆవిరి కూడా ఉన్నది. భూమి మండే గోళంగా ఉండి చల్లబడినప్పుడు నీటి ఆవిరి నీరుగా మారి వర్షంగా కురిసింది. ఈ నీరు భూమిపై పడుతూ, భూమియొక్క వేడికి తిరిగి ఆవిరి అవుతూ, పైకి వెళ్ళి మళ్ళీ చల్లబడి వర్షంగా కురుస్తూ వచ్చిందని శాస్త్రవేత్తలు చెబుతారు. భూమిపైన పడిన నీరంతా పల్లాలకు ప్రవహించింది. వాటిలో పెద్దవి సముద్రాలు.

7. పి. మనోహర్, మద్రాసు

"రాకాసిలోయ"లో రెక్కల మనుష్యు లందరికి రెక్కలు ఉండినట్లు చిత్రించిరి. కాని వారి నాయకునకు రెక్కలు లేకుండునట్లు చిత్రించిరి—

నాయకుడికి శరీరం నిండా ఈకలే ఉన్నాయి. అందుచేత వాడు అందరికన్న బాగా ఎగరగలడేమో!

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

అడ్డం పడితే

పంపినవారు:
డి. పి. రెడ్డి, సంతనూతలపాడు

Photo by Sundara Moorthy



బహుమతి
పొందిన వ్యాఖ్య

గడ్డంలో తు

పంపినవారు:
డి. పి. రెడ్డి, సంతనూతలపాడు

# తోకచుక్కలు

★ మనకు ఆకాశంలో కనిపించే అన్ని స్వరూపాల కన్నా తోకచుక్కలు చాలా పెద్దవి. వాటి "తలలు" తరుచు సూర్యుడి కన్నా పెద్దవిగా ఉంటాయి, "తోకలు" అనేక కోట్ల మైళ్ళ నిడివి కలిగి ఉంటాయి. అయితే వాటి బరువు చాలా తక్కువ; బరువును బట్టి వాటిని ఉల్కల శ్రేణిలో చేర్చవచ్చు.

★ తోకచుక్క బరువులో అత్యధిక భాగం దాని "కేంద్రం" లోనే ఉంటుంది. ఈ "కేంద్రం" నక్షత్ర కాంతితో ప్రకాశిస్తూ మనకు కనిపిస్తుంది. దాని చుట్టూ ఒక కాంతివంతమైన ధూమగోళం ఉంటుంది; దాని నుంచి ఈకలూ, తోకలూ వెలువడి, సూర్యుడికి ఎదురు దిక్కుగా ప్రసరిస్తూ ఉంటాయి. తోకచుక్క కేంద్రమూ, దాని చుట్టూ ఉండే ధూమ గోళమూ చేరి తోకచుక్క "తల" అవుతుంది. దాని నుంచే తోకలు పుట్టుతాయి.

★ సూర్యుడికి చాలా దూరంగా ఉన్నప్పుడు తోకచుక్కలు గుండ్రగా, తోక లేకుండా ఉంటాయి. సూర్యుణ్ణి సమీపించినప్పుడే వాటికి తోకలు ఏర్పడతాయి. కొన్ని తోక చుక్కలు సూర్యుడి సమీపానికి వచ్చినా వాటికి తోక లేర్పడవు.

★ తోకచుక్కల "కేంద్రాలు" చాలా చిన్నవి. 1910 మే లో వచ్చిన "హాలీ" తోక చుక్క కేంద్రం 30 కిలో మీటర్లు (20 మైళ్ళు) మించి ఉండదని అంచనా వేశారు. 1927 లోనూ, 1930 లోనూ వచ్చిన తోకచుక్కల కేంద్రాల నిడివి సుమారు 400 మీటర్లు మాత్రమే.

★ తోకచుక్కల కేంద్రాల బరువు కూడా చాలా తక్కువ. 1770 లో ఒక తోకచుక్క గురు గ్రహపు ఉపగ్రహాలకు దగ్గిరగా వెళ్ళింది, కాని వాటి గతులలో గమనించ దగిన మార్పేమీ కలగలేదు. అదే తోకచుక్క భూమికి 24 లక్షల కిలోమీటర్ల దూరంలో వెళ్ళింది, కాని భూమి యొక్క గతిలోగాని, చంద్రుడి యొక్క గతిలోగాని ఏమీ మార్పు కలగలేదు.

★ తోకచుక్క యొక్క కేంద్రంలో అనేక రకాల ఉల్కా పదార్థాలూ, కరుడు గట్టిన నీరూ, అమోనియా, మిథేన్, కార్బన్‌డై ఆక్సయిడ్ మొదలైన పదార్థాలూ ఒకే ముద్దగా ఏర్పడి ఉంటాయని 1950లో హ్విపుల్ అనే అమెరికను శాస్త్రవేత్త చెప్పిన సిద్ధాంతాన్ని అందరూ ఆమోదించారు.

★ ఆకాశంలోని అన్ని గోళాలలాగే తోకచుక్కల కేంద్రాలు కూడా గుండ్రంగా తిరుగు తూంటాయి. తోకచుక్క సూర్యుణ్ణి సమీపించినప్పుడు కరడు గట్టిన వాయువులన్నీ ఆవిరి రూపంలోకి మారి ఈకలూ, తోకలూగా ఏర్పడతాయి. (కేంద్రం తిరుగుతూ ఉండటంచేత దానికి అన్ని వైపులా సూర్యకాంతి పడుతుంది.)

★ తోకచుక్కల కక్షలు రెండు రకాలు. కొన్నిటి కక్షలు అతి దీర్ఘ వర్తులాలు. ఈ కక్షలలో తిరిగే తోకచుక్కలు చాలా ఏళ్ళ కొకసారి కనిపిస్తాయి. "హాలీ" తోకచుక్క 76 ఏళ్ళ కొకసారి కక్షను చుట్టి వస్తుంది. ("ఉల్కా సమూహాలు" కూడా ఇలాటి కక్షలలోనే ప్రయాణిస్తాయని రూఢి అయింది.)

★ రెండవ రకం తోకచుక్కలు చిన్న కక్షలలో తిరిగేవి. ఇవి రెండేళ్ళ నాలుగు మాసాలు మొదలు 18 ఏళ్ళ కొకసారి వస్తూంటాయి. (ఇలాటి కక్షలలో తిరిగే "ఉల్కా సమూహాలు" కూడా ఉన్నాయి.)

★ ఇప్పటివరకు 525 తోకచుక్కల కక్షలు గుణించ బడ్డాయి. వీటిలో 114 తోక చుక్కలు కక్ష మీద ఒకసారి తిరిగి రావటానికి 200 చిల్లర ఏళ్ళు పడుతుంది. తోక చుక్కలలో నూరింట 84 దీర్ఘ కక్షలలో తిరిగేవే.

★ సూర్యుడి చుట్టూ అనేక లక్షల కోట్ల తోకచుక్క లున్నాయనీ, వాటి కక్షలు సూర్యుడి నుంచి భూమికి గల దూరం కన్న 2 లక్షల రెట్ల దూరం దాకా వ్యాపించి ఉన్నాయనీ ఒక శాస్త్రవేత్త అన్నాడు. ఈ దీర్ఘ కక్ష గల తోకచుక్కలను ఒక్కొక్కప్పుడు, మన గ్రహాలైన గురు శనులు "పట్టేస్తాయి."

★ సూర్యుణ్ణి సమీపించిన తోకచుక్కలకు కాలం ముగిసినట్టే. సూర్య రశ్మికి తోకచుక్క లోని వాయువులన్నీ నిష్క్రమిస్తాయి. ఒక్కొక్కసారి తోకచుక్కలలోని కేంద్రాలలో గల లోహాలు సైతం ఆవిరి అయిపోతాయి. చిన్న చిన్న ప్రదక్షిణలు చేస్తూ చిన్న కక్షలో తిరిగే తోకచుక్క సూర్యుణ్ణి సమీపించినప్పుడల్లా తన "ద్రవ్యాన్ని" కొంచెం కొంచెం పోగొట్టు కొంటుంది.

★ ఈ విధంగా శిథిలమైపోయే తోకచుక్కల శిధిలాలే "ఉల్కా సమూహాలు!"

★ మన భూమికి కూడా తోకచుక్క లాగా పెద్ద తోక ఉన్నది, మీకు తెలుసా? ఇది సూర్యుడికి ఎదురు దిక్కుగా అనేక వేల కిలోమీటర్ల దూరానికి విస్తరించి ఉంటుంది. ఇందులో ఉండేది అతి పలచని వాయువు. ఈ తోక భూమధ్య రేఖకు సూటిగా ఉంటుంది. "క్రాంతి వృత్తకాంతి" అనేది కొన్ని ప్రాంతాల కనిపించటానికి ఒక కారణం ఈ "తోక" అని శాస్త్రజ్ఞులంటున్నారు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1963 డిశెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఏంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: అడ్డంపడితే

రెండవ ఫోటో: గడ్డంలోతు

పంపినవారు: డి. పుల్లారెడ్డి,

సంతనూతలపాడు, (గుంటూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'








బిన్నీవారి
కేస్‌మెంట్
బట్ట B. 5586
స్కూలు
యూనిఫారమ్‌లకు
ఉత్కృష్టము
IWT-BM-CC-2133
దిట్టమైనప్పటికీ మెత్తని ఈ బట్ట స్కూలు యూని ఫారమ్‌లు, ట్యూనిక్‌లు, స్కర్టులు మరియు షార్టులకు పెరుగుతూన్న అవసరాలను తీర్చడానికి ప్రత్యేకముగా డిజైను కావింపబడినది.





BANGALORE CITY
ది బెంగుళూరు ఉలెన్, కాటన్ &
సిల్క్ మిల్స్ కంపెనీ లిమిటెడ్,. అగ్రహారం రోడ్డు, బెంగుళూరు 23 బిన్నీ & కంపెనీ (మద్రాసు) లిమిటెడ్ వారిది



# పెప్స్ గొంతు మరియు గుండె బిళ్లలను

మీరు
సేవించేయడం
మీ దగ్గు త్వరితంగాపోవును

పెప్సను చప్పరించి, నొప్పిని నివారించే దర్యను జరుపునట్టి అందరి శమనకర ఆవిరులను ఆస్వాదించండి, అవి గొంతు నొప్పి, రొమ్ము పడిశెము, దగ్గు లేక జలుబునుగలిగించే క్రిములను చంపును. పెప్స్ తక్షణ నివారణను గలిగించి క్రిములను నిర్మూలించును.



ఇందులో హానికర
ఓషధులు లేవు పిల్లలకు
సురక్షితంగా
ఇవ్వవచ్చును.
రొమ్ము పడిశెములు;
గొంతు నొప్పి,
పడిశెము, అధిక
కఫము జలుబులు,
దగ్గులను
త్వరితంగా నివారించును

మందుల వ్యాపారులందరివద్ద అమ్మబడుచున్నవి
సి. ఇ. ఫుల్ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లి.

FPY-55-TEL

సోల్ ఏజంట్లు :

## దాధా & కంపెనీ,

86, నైనియప్ప నాయక్ వీధి,

మదరాసు - 3



ఆరోగ్య సుఖపూరిత
కుటుంబంలో సహచారి

ధూత్పాపేశ్వర్

# స్వామలా

అయుర్వేదీయ అభినవ సంయుక్త కల్ప





ధూత్పాపేశ్వర్
ఇండస్ట్రీస్
లిమిటెడ్
పన్వెల్-బొంబాయి

may/62/dil 8 telugu.

# రొంపను దరిచేరనీయకండి

## సేవించండి

## వాటర్‌బరీస్ కాంపౌండు | ఎర్ర లేబిలు

### కేవలం నివారిణియే కాదు నమ్మకమైన టానిక్కు కూడా!




వాటర్ బరీస్ కాంపౌండు మీద, తరతరాలుగా, కుటుంబాలు నమ్మకముంచి ఆధారపడడానికిగల అనేక మంచి కారణాలలో నాలుగింటిని ఈ క్రింద ఉదహరిస్తున్నాము.

1. వాటర్ బరీస్ కాంపౌండులో క్రియోసోట్ మరియు గయాకోల్ గలవు. అవి వాయు తిత్తులను శుభ్రపరుస్తాయి.
2. వాటర్ బరీస్ కాంపౌండు దగ్గులను సత్వరం ఫలప్రదంగా నిర్మూలిస్తుంది.
3. వాటర్ బరీస్ కాంపౌండు నివారిణియేగాక నమ్మకమైన టానిక్కు కూడా. శరీరప్రతిఘటన శక్తిని పెంపొందించడంలో సాయపడుతుంది.
4. వాటర్ బరీస్ కాంపౌండు ఆకలిపుట్టిస్తుంది. జీర్ణముగుటలో సాయపడుతుంది. రక్తమును శుభ్రపరుస్తుంది. మరియు ఖనిజ లవణముల నష్టమును భర్తీ చేస్తుంది.



## వాటర్‌బరీస్ కాంపౌండు | ఎర్ర లేబిలు

వార్నర్-లేంబర్ట్ పార్మసూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతలలో యు ఎస్ ఎలో స్థాపితము)

WCRY-3-TEL

వెండి తెరపైన మెరిసిపోయే అందాల తార వైజయంతిమాల ఇట్లు చెప్పుచున్నది :

## "న్యూట్రిన్, మిఠాయి దినుసులకు నూతనత్వాన్ని తెచ్చిపెట్టినది"



"న్యూట్రిన్ మిఠాయిలకు టాఫీలకు రుచిలో భేదమున్నది. నేనెల్లప్పుడు ఇంట్లో కొన్ని అట్టిపెట్టుకు వుంచుతాను. నేను నా అతిథులకు ఇచ్చేవి న్యూట్రిన్ మిఠాయిలే, ఎందుచేతనంటే మిఠాయిలన్నిటిలో న్యూట్రినే మంచివని మేమందరము ఏకీభవించాము."



నాణ్యత నెరిగి...
న్యూట్రిన్
కొనండి...



న్యూట్రిన్ కన్ఫెక్షనెరీ కంపెనీ ప్రైవేట్ లి.,
చిత్తూరు (ఆం. ప్ర.)

NC 86-A

ఫోటో : ఎ.వి.ఎమ్. వారి "లడ్కి" నుండి

---

# పరమానందము

అసలైన
గొల్లభామ డబ్బాలకే
మూతమీద
ఎంబాస్ ముద్ర
ఉంటుంది.




గమనిక . డబ్బా మూతను పూర్తిగా తీయండి. లోపల పాలను గాజు జాడీ లోకో గిన్ని లోకో వంచండి.

గొల్లభామ మార్కు గడ్డ పాల డబ్బా మూత తీయండి — ఉత్తేజాన్ని కల్గించే పుష్టికర పదార్థము నిండాగల డబ్బాను తెరిచారన్నమాట. ఎందుకంటే ప్రతి గొల్లభామ డబ్బా శుద్ధమైన తీయని తాజా పాలు రుచికరంగా మీగడంత చిక్కగా గట్టిపరచబడి నిండి తొణికిసలాడుతూంటుంది కుటుంబంలో అందరికీ ఇష్టమై శుద్ధమైన పాల వస్తువను రుచికరంగా అనుభవించడానికి, ఉత్తేజాన్ని కల్గించి పరమానందాన్ని పొందించడానికి గొల్లభామ గడ్డ పాలు విశిష్టమైనవి।



## గొల్లభామ
మార్కు
పూర్తి మీగడగల తియ్యని గడ్డ పాలు




నెస్సల్ ఉత్పాదన.

## కండల నొప్పులు
## పోగొట్టుకోండి ఇదిగో
# అమృతాంజనము

అమృతాంజన్‌లో శమనాన్ని కలిగించే 10 రకాల ఔషధాలు ఉన్నాయి. త్వరగా నమ్మకంగా నివారణ కలిగిస్తుంది. అతి కొంచెము వాడవలసి ఉండటంచేత ఒకే సీసా నెలల పాటు వస్తుంది. 70 ఏళ్ళు పేరు గడించిన అమృతాంజన్ బెణుకులకు, తలనొప్పికి, గుండె జలుబుకు, ఇతర బాధలు, జలుబులు మరియు నొప్పులకు అమోఘమైనది.

గాలిమార్పు, నిత్యజీవితంలో తాపత్రయాలు నొప్పులను, జలుబులను ఇతర బాధలను కలిగిస్తాయి. ఇంట్లో ఒక అమృతాంజన్ సీసా ఉంచుకోండి.

## అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు

అమృతాంజన్ క్రొత్తగా అట్టపెట్టెలో వస్తూంది. సీసా 'అలూ'కాప్‌తో సీలు చేయబడి ఉంటుంది.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి
కలకత్తా - ఢిల్లీ

JWT/AM/2332

87

